# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాస పత్రిక

**34**

జూలై 1972

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

4 పేజీలు | 1 రూపాయి

ముఖచిత్రం :

ఎంజెలా డేవిస్

ఈ సంచిక తయారవుతుండగానే
ప్రపంచపీడిత ప్రజల విముక్తి ఉద్యమాలకు,
నీగ్రోల, నల్లవులుల ప్రతిఘటన ఉద్యమానికి తలవంచి
కాలిఫోర్నియా న్యాయస్థానం ఎంజెలా డేవిస్‌ను
నిర్దోషిగా ప్రకటించి విడుదల చేసింది.

ప్రతులకు, వివరాలకు :

సృ జ న
హనుమకొండ
వరంగల్-1 (ఆం.ప్ర.)

విడిప్రతి: ఒక రూపాయి
అర్ధసంవత్సర చందా: ఆరు రూపాయలు
సంవత్సర చందా: పది రూపాయలు

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyderabad. Wide Rc. No. 182/A4/67, dated 22-9-1967.

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayam,
J. P. N. Road, Warangal-2 (A.P.)

# సృజన

ఆధునిక సాహిత్యవేదిక

1972 జూలై — మాసపత్రిక 34



ఈ సంచికలో ప్రారంభమైన
టావ్-చెంగ్ నవల
నా కు టుం బం
కోసం 25వ పేజీ చూడండి.

# మా శివుడు మృత్యుంజయుడు

మా శివుడు మృత్యుంజయుడు
రాజ్యాంగ మహిషాన్నెక్కిన
అధికార గర్వాంధులు
ఎన్నైనా చెప్పుకోనీ
మా శివుడు మృత్యుంజయుడు

పెనునిద్దురలో ఉన్న మమ్మల్ని
మేల్కొలిపి దారిచూపిన
మా శివుడు మృత్యుంజయుడు

మేము కలలుగన్న, కవితారూపం
పెన్ను ఒకచేత గన్ను ఒకచేతబట్టి
సవ్యాప సవ్యాలుగా-
గీతాలనూ తూటాలనూ
కురిపించిన మా శివుడు మృత్యుంజయుడు

నడకలో పలుకులో మూర్తీభవించిన వినయం
అడుగడుగునా ఉట్టిపడే
మానవతా కారుణ్యం
వెన్నుచూపని సహచరుల
మరణానికి చెమర్చిన మూడవ నేత్రం
మా శివుడు మృత్యుంజయుడు

ఒకకంట ఆశయాలతేజం
మరోకంట సంకల్ప బలం
మూడవకన్ను తెరిస్తే సర్వమానవ కల్యాణం
మా శివుడు మృత్యుంజయుడు

— శివకుమార్

## నీగ్రో ఉద్యమం

### ఏంజెలాడేవిస్:

వ్యక్తి తన మానవత్వాన్ని నిలుపుకొనేందుకు పోరాడడమే విప్లవకరచర్యగా వుంటున్న యీ రోజుల్లో వ్యక్తిత్వాన్ని, రాజకీయాలను వేరుచేసిచూచే తప్పు పద్ధతి సాగదు. ఈ దృష్టితోనే చూడాలి ఏంజెలా జీవితాన్ని. ఏంజెలా అన్నది, "నిజమైన విప్లవకారులు తమ వ్యక్తిత్వాలనూ, రాజకీయాలనూ సమన్వయించటానికే, రెండూ విడదీయరానంతగా సమ్మేళనం చేయటానికే కృషిచేస్తారు." జీవితాన్ని, వ్యక్తిగత జీవితాన్ని ముఖ్యమైనదిగా చూచుకోనపుడే, స్వేచ్ఛకోసంసాగే సమిష్టిపోరాటంలో రాజకీయంగా అది ముఖ్యమైనదవుతుంది. ఏంజెలా ప్రకటించింది" నేను నా జీవితాన్ని పోరాటానికి అంకితంచేశాను. అది పోరాటానికి చెందినదే." అందుకని ఏంజెలా జీవితాన్ని తెలుసుకోవాలంటే ఆ పోరాటాన్ని అర్థం చేసుకోవాలి.

27 ఏళ్ళ క్రితం అలబామా రాష్ట్రంలో పుట్టింది. అప్పటి నల్లవారంతా సైనికులుగా యితర దేశాల్లో ఫాసిజంతో యుద్ధాలకు పంపబడేవారు. కాని స్వదేశం వస్తే ఆ ఫాసిజమే వాళ్ళపై పెత్తనం చేస్తుందేది. వర్ణవివక్ష, అవమానాలూ దోపిడీ అలా సాగుతున్నయ్, అవి 'దేవునివరాలే' అన్నట్లు, అదే 'అమెరికన్ జీవవసరళి' అన్నట్లు చలామణీ అవుతున్నయ్. ఇలాంటి దక్షిణప్రాంతంలో తనలాంటి అనేకులైన నల్లవారిలాగనే ఏంజెలాకుకూడా పరిస్థితి అర్థంకావటం మొదలైంది. జార్జి వాలెస్‌లాంటి తెల్లదురహంకారుల 'శాంతి''రక్షణ'లు చవిచూచింది. ఆమెతరంలో వస్తున్న నల్లవారి ప్రతిఘటనాధోరణులనూ చూచింది. ఆ ప్రతిఘటనలో పాల్గొంది. తెల్ల నల్ల వారలకు వేరువేరుగావుండే స్కూళ్ళు, హోటళ్లు వగైరాలముందు పికెటింగ్ చేసింది. నల్లివార్ని ఓటర్లుగా నమోదుచేయటం వగైరాల్లో పాల్గొన్నది. ఈ తొలి సంవత్సరాలు యువక ఆశలతోటి పాతభయాలతోటి నిండివుండేవి తెల్ల దురహంకారుల దాడులకు గురవుతూండే ప్రాంతమే తనది. అక్కడ నిత్యమూ నల్లవారిపైజరిగే అత్యాచారాలనడుమనే జీవించింది. ఎన్నోసార్లు తనకే ఏంజరుగుతుందో అనే ఆవేదనలోనే బాల్యంగడిపింది. ఒకసారి నల్లవారి చర్చిపై దుండగులు బాంబులువేయటం, నల్గురు బాలికలు చనిపోవటం స్వయంగా చూచింది. ఆ బాలికల కుటుంబాలబాధ తనకు స్వయంగాతెలుసు. ఆదౌష్ట్యానికి ఏకారణమూలేదని తెల్ల పిచ్చికే వారు బలయారనీ ఎరుగును తను. అపుడు ప్రభుత్వం ఎవర్నీ అరెస్టు చేయలేదు.

తన 15వ ఏట బర్మింగ్‌హాంవదలి స్కాలర్‌షిప్‌తో న్యూయార్క్ హైస్కూల్లో చదవటానికి వెళ్ళింది. బర్మింగ్‌హాంలో తను చదివిన స్కూలు నల్లవారికొరకైనది కనక చాలా అధ్వాన్నంగావుండి చదువులో వెనుకబాటుగావుండేది. అందువల్ల ఏంజలా న్యూయార్క్ స్కూల్లో మిగతవాళ్ళతో కలవటానికి కష్టపడి చదవాల్సివచ్చింది. తెలివి గలదయికూడా. బాగా అభివృద్ధి కనబరచి స్కూలు చివరిక్లాసులో మంచి మార్కులకు స్కాలర్‌షిప్‌పొంది బ్రాండీస్ యూనివర్సిటీలో ఫ్రెంచి సాహిత్యం ముఖ్య సబ్జెక్టుగా తీసుకొని చేరింది.

మొదటి సంవత్సరం పారిస్‌లోని సార్‌బాన్‌లో చదివింది. అక్కడ అల్జీరియన్ విద్యార్థులతో పరిచయంకల్గింది. వారు ఫ్రెంచిసామ్రాజ్యవాదులనుండి విముక్తికై ఎలా పోరాడుతున్నారో తెలుసుకుంది. అల్జీరియా తదితర రంగుజాతుల విద్యార్థులను ఫ్రెంచి పోలీసులు మాటిమాటికీ సోదాచేయటం, విసిగించటం, బెదిరించటం ఆమె చూచింది. చివరి సంవత్సరంలో తత్వశాస్త్రం ప్రొఫెసర్ హెర్‌బర్ట్ మార్క్యూజ్‌వద్ద చదివింది. చివరకు గొప్పగా ప్యాసయింది. జర్మన్‌ప్రభుత్వ స్కాలర్‌షిప్‌పొంది ఫ్రాంక్‌ఫర్ట్‌లో చదువుతూ జర్మనీలోని తీవ్రవాద సోషలిస్టుగ్రూపు అయిన ఎస్ డి యస్.లో చురుకుగా పాల్గొంది. ఆ గ్రూపుతో కలిసి వియత్‌నామ్‌లోని అమెరికాయుద్ధానికి వ్యతిరేకంగా ప్రదర్శనల్లో పాల్గొంది. రెండేళ్ళతర్వాత స్వదేశం తిరిగొచ్చింది.

ప్రొఫెసర్ మార్క్యూజ్‌వద్ద కాలిఫోర్నియా యూనివర్సిటీలో తత్వశాస్త్రం పూర్తిచేసింది. అపుడే దక్షిణకాలిఫోర్నియా నల్లజాతి ప్రజోద్యమంలో చురుకుగా పని చేసింది. ఆ యూనివర్సిటీ కాంపస్‌లోకూడా ఆఫ్రికన్లకొరకు లుముంబా యూనివర్సిటీ స్థాపించాలనే డిమాండ్‌కొరకు పోరాడింది. ఆ రోజుల్లోనే యీ నిర్భంధ, వర్ణవివక్ష సమాజంలో యిలాంటి కార్యకలాపాలు నిర్బంధవిధానానికి గురికాక తప్పదని తెలుసుకుంది. 18 ఏళ్ళ కుర్రవాడు గ్రెగరీక్లార్క్‌ను పోలీసులు చంపటంతో, సమానత్వం స్వాతంత్ర్యంకొరకు ఏ చిన్న ఉద్యమాన్నయినా యెంత క్రూరంగా అణచే ఫాసిస్టు రాజ్యంగమో తెలుసుకుంది. పోరాటంలో చేరటం అంటే అభిప్రాయ, మానసిక నిబద్ధతమాత్రమేకాదని జీవితాన్నే పణంగా పెట్టవలసివున్నదని అర్థంచేసుకుంది. త్వరలోనే కమ్యూనిస్టుపార్టీలోచేరింది. అందులోచెరి లుముంబా క్లబ్ సభ్యురాలయింది.

తర్వాత బ్లాక్ పాంథర్‌పార్టీతో సన్నిహితంగాపనిచేసింది. అపుడే తన మిత్రులూ పాంథర్ నాయకులూ అయిన యిద్దర్ని కాంపస్‌లోనే తుపాకులతోకాల్చి చంపటం

కళ్లారా చూచింది. ఈ రోజులే తన నిబద్ధతకూ, తన జీవితానికీకూడా అపాయాన్ని సూచించినవి.

కొందరు అభిప్రాయాలతో ఆటలాడతారు. భావాలు కలిగి వుండటం మాత్రమే అనే విలాసానికి లోనవుతారు. కాని కొందరు భావాలుకలిగి వుండటంఅనేది సీరియస్ సమస్యగా చూస్తారు. నిత్యజీవితంలో నమ్మని భావాలను కలిగి వుండటం తప్పంటారు. ఈ రెండవతరహా వ్యక్తి ఏంజెలా. తన అభిప్రాయాలకు పూర్తిగాకట్టుబడి వుంటుంది. అందుకే ప్రొఫెసర్‌గా నియామకం అయాక, యూనివర్సిటీబోర్డు కమ్యూనిస్టు అని ఆరోపణచేసి విచారణచేసినపుడు యిలాఅంది "అవును నేను కమ్యూనిస్టునే" అని బల్ల గుద్ది చెప్పింది. నిక్సన్ రీగాన్‌లే పెట్టుబడిదార్ల ఏజంట్లనీ ప్రపంచపు ప్రజలందరి కష్టాన్నీ దోచుకొనే దొంగలూ నేరస్తులూ వారేనని వారినే విచారణ చేయాలని యెదురు ఆరోపణచేసి వాదించింది.

అమెరికాలోనూ, దేశదేశాల్లోనూ ప్రజలు విప్లవకర ఆలోచనలకు ఆచరణకు క్రమంగా మళ్ళుతున్నారని, అలాగే విప్లవ ప్రతీఘాతకులుకూడా దీన్నెదుర్కొని అణిచేందుకు ఏంతకయినా తెగించుతారని ఎంతనీచపు హత్యలకయినా పాల్పడతారని అర్థంచేసుకుంది. తెలిసికూడా నిలబడ నిశ్చయించుకుంది. ఒక నల్ల స్త్రీ విప్లవ కారిణిగా, కమ్యూనిష్టుగా నిర్భయంగా బయటకొచ్చి పెట్టుబడిదారీ వ్యవస్థను సవాల్‌చేసి నిలబడుతూంటే, యిది యిప్పటివరకూ నిశ్శబ్దంగావున్న చాలామందికి వుత్సాహాన్నిచ్చి కదల్చింది. వాక్‌స్వాతంత్ర్యానికీ, బహిరంగ ప్రతిఘటనకు ప్రతీకగానిలచింది. అందుకే గవర్నర్ రీగాన్‌ముఠా కుట్ర చేసింది. మొదలు ఉద్యోగంపూడ గొట్టాలని చూచారు. కోర్టులో అదిసాగలేదు. ఆపైన యితరమార్గాలూ కుట్రలూ మొదలెట్టారు. ఆమె క్లాసులకు విద్యార్థులు వందలువేల సంఖ్యలో వచ్చేవారు. అందరూ ఎక్సలెంట్‌గా చెబుతున్నదనేవారు. క్లాసుల్లో నిర్భయంగా తనభావాలను ఎంతపైమయినా తీసుకొని చక్కగాచెప్పేది. సబ్జక్టునుకూడా బాగా అర్థంచేసుకుని చెప్పేది.

1970 మొదటి రోజుల్లో జైలుగార్డుని చంపారనే అబద్ధపునేరంమీద విచారించ బడుతున్న ముగ్గురు నల్లఖైదీలు సోలెడడ్ సోదరుల రక్షణకు చురుకుగా పనిచేసింది. దేశప్రజల్లో నల్లవారు నూటికి 15 మంది అయితే దేశం మొత్తంలోని ఖైదీలలో నల్ల వారు నూటికి 30 మంది అనే సంగతిని తన ఉపన్యాసాల్లో వెల్లడిచేసేది. నల్ల తీవ్ర వాదులను తీవ్రాతితీవ్ర హింసలకు గురిచేయటం, కాల్చిచంపటం గురించి ఉపన్యాసా

లిచ్చింది. నల్లవారు జీవితాలనే అర్పించటంముందు తన ఉద్యోగం పోవటం ఒకలెక్కే కాదనిచెప్పింది. సోలెడడ్ సోదరులకొరకు కృషిచేయటంలో జూనాతన్ జాక్సన్‌తో స్నేహం అయింది. అతనికి 17 ఏళ్ళు. సోలెడడ్ సోదరుల్లో ఒకతని తమ్ముడు జూనాతన్ జాక్సన్. యీ సమయంలో ఆమెకు ఎన్నో బెదిరింపులు వచ్చాయి. చంపేస్తామని జూనాతనూ, యింకితరులూ (చె-లు ముంబా క్లబ్ సభ్యులు) ఆమెకు రక్షణగా తిరుగుతూండేవారు.

ఇంతపట్టుదలతో యీమె పనిచేయటంవల్ల గవర్నర్ రీగాన్ ఉద్యోగం తీసేయ టానికి మళ్ళీ ప్రయత్నించాడు. ఆమె ఉపన్యాసాల కారణంగా ఉద్యోగంనుంచి తీసేశారు.

ప్రతిఘటనకు ప్రతిరూపంగా అందరి కళ్ళలోనూ ప్రకాశించింది. ఆమెను ఉద్యోగంనుండి తొలిగించటం ప్రతిఘటనోద్యమానికి యింకింత బలాన్నేయిచ్చింది. పరిపాలకుల యిష్టానిష్టాలమీద ఆధారపడివుండే చిత్తుకాగితమే యీ రాజ్యంగ చట్టం, పౌరహక్కులూ వగైరాలనేది చాలామందికి తెలిసిపోయింది. కోర్టులో ముద్దాయీల హత్య, తుపాకీ కాల్పుల ఘటనను రీగాన్ ఉపయోగించుకొని ఏంజెలా జీవితాన్నే అంతంచేయాలని కుట్రపన్ని హత్యానేరంతో నిర్బంధించజూచాడు. అప్పుడు ప్రారంభ మయింది. ఈ దేశచరిత్రలోనే దుష్టాతిదుష్టమైనవేట. ఆమెకొరకు గాలింపు. ఒక యువతి, పూర్వం నేరాలు, అరెస్టు చరిత్రలేనిది, సిఐడి శాఖ యొక్క పట్టుకోవాల్సిన ముఖ్యమైనవాళ్ళు 10 మంది లిష్టులో ఒకామెఅయింది. అపాయకరమైన, సాయుధ మైనది. వారు చిత్రించి ప్రచారం చేశారు. ఇందువల్ల ఏ దుష్ట తెల్ల దురహంకారి అయినా ఆమెను హత్యచేయటానికి అవకాశంవుంది. ఆమె కొరకు జరిగిన వేటలో పోలీసు ఆమెతో సంబంధంవున్నదనుకున్న అందరివ్యక్తుల యిళ్ళు అన్నిఉద్యమాల ఆఫీసుల్లో సోదాచేశారు, అందర్నీ భయపెట్టారు. చివరకు న్యూయార్క్‌లో అరెస్టు చేశారు. న్యూయార్క్ జైలు స్త్రీ వార్డులోవుంచినప్పుడు ఒంటరిగదిలో రోజుల్లా నిర్బంధించి వుంచేవారు. రాజకీయ ఖైదీలకు చాలామందికిలాగనే ఆమెనూ యితరు లతో కలిసే వీలులేకుండా చేశారు. అలా వంటరిదాన్నిచేసి నిర్బంధించి బయట ఆమె శత్రువులు ఆమెకు వ్యతిరేకంగా నీచాతినీచ ఆరోపణలతో విపరీతమైన ప్రచారం చేసు కొన్నారు. నిక్సన్ సిఐడి శాఖను అభినందించాడు. ఆమె అరెస్టు తీవ్రవాదులంద రకూ హెచ్చరికవుతుందన్నాడు. నల్ల ప్లీడర్ల సంఘం కోర్టులో దావావేశింది. ప్రజా

పరిదర్శనలు జరిగాయి. వేల ఉత్తరాలు, టెలిగ్రాములు వచ్చాయి. ఒంటరికొట్టు నుంచి విడిపించాలనేది కోర్టులో నెగ్గింది. మామూలు అందరి ఖైదీలలాగా వుంచాల్సొచ్చింది.

దేశంలో జరిగే అత్యాచారాలు పేదలకు, నల్లవారకూ జరిగే నిత్యఅవమానలు దోపిడీ, దారిద్ర్యం, ఆమెస్వయంగా పొందిన అవమానాలు యివన్నీ ఆమెను యోధురాలుగా తయారుచేశాయి. ఏదో మేధావిగా ఊహా మనసుతో సిద్ధాంతపరంగా ఆలోచించి ఉద్యమంలోకి దిగటంకాదు. ఆమె జీవితంనుంచి నేర్చుకొని జీవించటంకోసమే పోరాట నారంభించింది. ఆమె నేరస్తురాలా! హంతకులు దోపిడీదార్లు ఆమెను అనేక రకాల నోరుమూయించ చూచారు. సాధ్యంకాకపోయేసరికి చంప నిశ్చయించుకున్నారు. అందుకే యీ అభియోగాల, విచారణల తతంగం.

ఆమెకు జీవితమూ పోరాటమూ ఒకటే. ఆమె ఏ నేరాలూ చేయలేదు. మానవత్వాన్ని ప్రేమించటము, అందరి స్వేచ్ఛకొరకూ తన జీవితాన్నే పణంగాఒడ్డి పోరాడటమూ యివే ఆమె చేసిన నేరాలు.

ఏంజెలాను విడవండి! మా సోదరిని విడవండి!

రాజకీయ ఖైదీలనందర్నీ విడవాలి!

## నల్ల పులులు

### జార్జ్ జాక్సన్, జొనాథన్ జాక్సన్:

జార్జ్ జాక్సన్, జొనాథన్ జాక్సన్ యిద్దరూ తీవ్రవాద నీగ్రో ఉద్యమంలో పాల్గొని ప్రాణాలు బలిదానంచేసిన యోధులు. రాకేల్ మ్యాగీ విచారణ జరుగుతున్న సమయంలో కోర్టులోకివచ్చి జడ్జ్‌నూ, పోలీసులనూ ఆయుధాలతో బెదిరించిన జొనాథన్ జాక్సన్ అప్పుడే పోలీసులు జరిపిన కాల్పుల్లో చనిపోయాడు. ఇతడు 17 ఏళ్ళ పిల్లవాడు. ఇతన్ని ఏంజెలా డేవిస్ ప్రేమించినట్లుగా ఆమె ఉత్తరాలద్వారా తెలుస్తున్నదని అందుకనే ఈ సోదరులకు ఆమె ఆయుధాలందించిందని యిప్పుడు అమెరికా కోర్టులో పోలీసులు కేసు నడుపుతున్నారు. తర్వాత కొంత కాలానికి 71 ఆగష్టులో జార్జ్ జాక్సన్‌నుకూడా సోలెడాడ్ జైల్లో పోలీసులు కాల్చేశారు.

జార్జ్ జాక్సన్ జైలు వుత్తరాలు ఈ నాడు విప్లవ సాహిత్యంలో ఉత్తేజకరమైన భాగంగా చేరిపోయాయి.

జొనాథన్ జాక్సన్ గురించి జార్జ్‌జాక్సన్ చెప్పిన మాటలు, "పసిపిల్లవాడయిన మనిషి, పొడగరి, అల్లరిపిల్లవాడు, మృదువైన స్వభావం కాంతివంతమైన కళ్లు. నల్లమానవుని శిశువు. 1970 ఆగష్టు ఏడవతేదిన ఒక చేతిలో సాహసంతో మరో చేతిలో శతుృవు గుండెలపై రైఫిల్‌తో నేల కొరిగాడు. నా సోదరుడు, కామ్రేడ్, స్నేహితుడు, నిజమైన విప్లవకారుడు, అభివృద్ధి శిఖరాలు చేరుకున్న నల్ల కమ్యూనిష్టు గెరిల్లా. అన్యాయాన్ని సహించలేని కసితో ట్రిగర్ మీదవేళ్ళుంచి చనిపోయాడు. ప్రజాసైనికుడు."

## ఎరికా హగిన్స్, బాబీసీల్ :

ఎరికాహగిన్స్, బాబీసీల్ యిద్దరూ బ్లాక్‌ప్యాంథర్ పార్టీ నాయకులు. నీగ్రో ఉద్యమాల్ని నిర్వహించిన కారణంగా వీళ్ళపై పోలీసు, ఎఫ్.బి.ఐ. కలిసి జాతి వివక్ష కుట్రిపన్ని ఎన్నో హత్యానేరాలుమోపి చాలాకాలం జైళ్ళలో వుంచారు. కోర్టుల్లో చివరకు పోలీసుఏజంటే ఈ విషయాన్ని అంగీకరించడంతో ఈ యిద్దర్నీవదలకతప్పలేదు.

ఎరికా హగిన్స్ భర్త జాన్ హగిన్స్‌ను 1969 లో లాస్ ఏంజిల్స్‌లో పోలీసు ఏజంట్లు హత్య చేశారు. ఈ అందమైన నల్లయువతి తన స్వరాష్ట్రిమైన కనెక్టికట్ లో, లాస్ ఏంజిల్స్‌లో బ్లాక్‌ప్యాంథర్ పార్టీకి ప్రిముఖమైన కార్యకర్త. జైల్లోరాసిన ఆమె గీతాలు ఆమె మానవతా హృదయానికి, ఉత్సాహానికి, విప్లవంపట్ల గాఢమైన ప్రేమకు చిహ్నాలు.

ఎరికా గీతాలు రెండు :

### విప్లవ అవగాహన

నా పేరు ఎరికా
ఇరవై రెండేళ్ళు
ప్రజలను ప్రేమిస్తాను
ప్రకృతిని ప్రేమిస్తాను

ప్రేమను ప్రేమిస్తాను
నేను రెవల్యూషనరీని.
ఏ ప్రత్యేకతా లేదు
ఒక ఆత్మ
ఒక జీవితం
అది అర్పించేందుకు సర్వదా సంసిద్ధం
మరణానికి సిద్ధం.

ఆజ్ఞా పత్రం

'మన యోధుని బలిదానం
మనకొక 'ఆజ్ఞాపత్రం'.
చావలేక బతుకుతున్న
శతసహస్ర యువకులకు
బలిదానం ఆజ్ఞా పత్రం.
అన్యాయ అవమానాలకు
తలొగ్గుతూ నీచంగా
చేతగాక బతకొద్దని
పోరాడుతూ మరణిస్తూ
కలకాలం బతకండని
మనకిచ్చిన సందేశం
మన యోధుని బలిదానం.

బాబీసీల్:

మనం ప్రజావిప్లవ పోరాటాలగురించి ప్రజలకు ఎక్కువ విస్తృతంగాతెల్పాల్సి వున్నది. యుద్ధాన్ని జాతి వివక్షను, దౌర్జన్యాన్ని తుదముట్టించడానికి జరుగుతున్న

ప్రజాపోరాటాల గురించి చెప్పాలి. శాంతిని ప్రేమించే సమాజమూ, ప్రపంచమూ ఏర్పడడానికి మనమెలా తోడ్పడడానికి ప్రయత్నించాలో శాంతిప్రియులుగా విప్లవకారులుగా మనకు తెలుసు, మనమేది విశ్వసిస్తున్నామో అది ప్రజలకు విస్తృతంగా అర్థమయేట్లు చూడాలి. "అధికారమంతా ప్రజలచేతుల్లోకి రావాలి" అన్న మన అందమైన వినాదం ప్రజలందరికీ చేరాలి.

అమెరికాలోని యువతరం— వాళ్ళ శాంతికాముకమైన హృదయాల్లో అన్ని రకాల దోపిడీ, దౌర్జన్యాలు, జాతివివక్షలూ, యుద్ధాలూ పమసిపోవాలని కోరుకుంటున్న యువతరం— అదే నిజమైన అమెరికా,వాళ్ళే మానవ ప్రజలు. వేరే అమెరికా అమెరికా కాదు అదిఅమెరిక్కా, అదిఅమెరికా స్వప్నంకాదు. పీడకల.

అమెరికా కలలుగంటున్నవి ప్రపంచశాంతి, దోపిడీ జాతి వివక్షల అంతం. ఈ అమెరికాస్వప్నం ముప్పయ్యేళ్ళ వయస్సున్న అరవైశాతం ప్రజల హృదయాల్లో గాఢంగావున్నది.

— బాటీసీల్.

## కార్మిక దృష్టి

"వాళ్ల దృష్టిలో పెట్టుబడిదారు పట్టపగలు గుట్టుచప్పుడుకాకుండా దోచే దోపిడీదొంగ. జనం తాలూకు అజ్ఞానంమీదా ఆకలిమీదా ఆ రెంటి బాధలేని వాళ్లలో- తన ప్రభావంద్వారానాటిన దురాశమీదా, బతికే రాక్షస జంతువు. దాని అంట్లగిన్నెలకోసం కక్కుర్తిపడే వండేమనిషినీ, పెట్టేచేతినీ గుర్తించదు."

—కా. రా.

# విప్లవ కాలంలో సాహిత్యం

లూసన్

ఇటీవలి అనుభవాలవల్ల సాహిత్యంపై నా పాత నమ్మకాలు చెదిరిపోయేయి. విద్యార్థుల్ని చిత్తం వచ్చినట్టు కాల్చేసేవారు. గట్టి సెన్సారింగ్ కూడావుండేది. అప్పుడు బలహీనులు ఏంచెయ్యలేనివాళ్ళు మాత్రమే సాహిత్యం గురించి మాటాడేవారని నేననుకుంటాను. బలంగలవాళ్లు మాటాడాల్సిన పనేలేదు. వాళ్ల దౌర్జన్యం చేస్తారు. బలహీనుల్ని చంపుతారు. బలంవున్నవాళ్లు బలహీనుల్ని అణిచేసి, అవమానించి, హింసించి చంపేస్తుంటే అణగారిపోతున్నవాళ్లు పెదవి కదిపి ఒక మాటన్నందుకో ఒక రచన చేసినందుకో చావుకు సిద్ధపడాల్సివచ్చేది. ఒకవేళ ఎలాగో చావుతప్పించుకున్నా కేకలెయ్యడం. మొత్తుకోడం. మొరపెట్టుకోడంతప్ప పీళ్లు చెయ్యగల ప్రతిఘటన ఏదీ ఉండేదికాదు మరి అలాంటప్పుడు సాహిత్యంవల్ల ప్రజలకి ఒరిగేదేవిటి?

జంతువుల్లోకూడా యిదింతే. ఏదేనా ఓగెద్ద కోడిపిల్లని కాళ్లకింద నొక్కిపట్టి ముక్కుతో పొడుస్తుంటే గిజగిజ తన్నుకుంటూ కురకురలాడ్డమే కోడిపిల్లవంతు. గెద్ద మాత్రం నిబ్బరంగా నిండుగా తొణక్కుండా కూచుంటుంది. అలాగే. పిల్లి ఎలకను పట్టిందనుకుందాం. చడీ చప్పుడూలేకుండా పిల్లి చల్లగా వినోదంచూస్తూ కూచుంటుంది. తలప్రాణం తోకకివచ్చేలా ఏడవడమే ఎలక్కి మిగుల్తుంది. మొత్తుకోడం మొరపెట్టుకోడం తప్ప యింకేఁవీ చెయ్యలేనివి చివరికి మెత్తగా మెదలకుండానే మింగేసేవాటికి బలైపోతాయి. మొరగడం, మొత్తుకోడమే అయితే అంతకన్న ప్రయోజనం ఏవిటి? కొందరు రచయితలకు బతికుండగా మంచి పేరుంటుంది. కొంత మందికి చనిపోయేక కూడా కొంచెం కాలం మిగిలేటంత కీర్తి రావచ్చు.

సాహిత్యం విప్లవానికి చాలా దోహదంకూడా చెయ్యగలదని చాలా మంది అభిప్రాయం. విప్లవ భావాల్ని ప్రోదిచేసి, ప్రోత్సహించి, విప్లవాన్ని త్వరితం చెయ్యడానికి సాహిత్యం ఉపయోగపడవచ్చు. కాని, అలా కావాలని పనిగట్టుకునిరాసే రచనలు అంత శక్తివంతంగా వుండవని నాకనిపిస్తుంది. మంచిరచనలు పనిగట్టుకు రాయిస్తే వచ్చేవికావు. వాటి ప్రభావం ఎలావుంటుందన్నధ్యాసలేకుండా మంచి రచనలు మనసులోంచి వాటంతటవే సహజంగా పుట్టుకురావాలి.

ఇచ్చిన విషయంమీద చెప్పినట్టు రాయడంఅంటే బడిపిల్లడు కాంపోజిషన్ రాసి నట్టే వుంటుంది. అలాంటి రచన పాఠకుణ్ణి ఏమీ కదిలించదు. దానికి సారస్వతంలో స్థానం వుండదు. విప్లవానికి ముఖ్యంగా కావలసింది విప్లవకారులు. విప్లవసాహిత్యం ఆతర్వాత వస్తుంది. ఎందుకంటే విప్లవకారులు రాయడం ప్రారంభించాకనే నిజమైన విప్లవసాహిత్యం లభిస్తుంది. కాబట్టి సాహిత్యాన్ని విప్లవం ప్రభావితం చేస్తుంది తప్ప అటునుంచి యిటుకాదనే నేననుకుంటున్నాను. విప్లవతరుణంలో వచ్చే సారస్వతానికీ మామూలుసమయంలో వచ్చే సారస్వతానికీ యెంతో తేడా వుంటుంది. విప్లవం వల్ల సారస్వతం ఎంతో మార్పుచెందుతుంది. అయితే గొప్ప విప్లవాలుమాత్రమే సాహి త్యాన్ని మార్చగలవు. అమాత్రం యీమాత్రంవి లెక్కలోకిరావు. విప్లవం అనే పదం మనకు చాలా పరిచితమైపోయింది. కాని ఆ మాట వింటేనే బెదిరిపోతారు కొందరు. విప్లవం అనేది ఎక్కణ్ణించో దిగిన కొత్తవిషయంకాదు విప్లవం నిత్యం కొనసాగుతూవుంటుండికనకనే మానవపరిణామం సాధ్యమయింది. నాగరికత పెరుగు తూవుంది. మనుషులు కోతులు ఒకేతెగ జీవులని జీవశాస్త్రజ్ఞులు చెబుతారు. అయితే మనుషులు మనుషులుకాగా కోతులు యింకా కోతులుగానే యెందుకు వుండిపోయేయి? ఎందుకంటే కోతులు మారడానికి యిష్టపడలేదు కనక— అవి నాలుగు కాళ్లమీద నడవా లనుకుంటున్నాయి కనక. ఒకానొకప్పుడు ఒక కోతి వెనక రెండుకాళ్లమీదా నిలబడి నడవడానికి ప్రయత్నించగా, మిగతా కోతులు 'మనపూర్వీకులంతా నాలుగు కాళ్లమీదా పాకుతూనేవుండేవారు, మనం ఎంతమాత్రం నిలబడ్డానికి వీల్లేద'నివుంటాయి. అవన్నీ దానిమీదపడి కరిచి చంపేసి వుండొచ్చుకూడా. అవి సాంప్రదాయ బుద్ధులు కనక నిల బడ్డానికి నిరాకరించడమేకాక పెదవివిప్పి పలకమంటే పలకమనికూడా పట్టుబట్టి అలాగే ఉండిపోయివుంటాయి. అయితే మనుషులలాకాదుకదా. వాళ్ల కాళ్ళమీద వాళ్లునిలబడి, గొంతువిచ్చి మాటాడేరు. అందువల్లనే నెగ్గి మనుషులయేరు. మార్పుకోసం ఆపోరా టం నిరంతరం అలా సాగుతూనేవుంది. అందుచేత విప్లవం మనకు కొత్తదేంకాదు. సజీవంగా చైతన్యంగావుండే జాతులన్నీ ప్రతిదినం తిరుగుబాటుచేస్తూనేవున్నాయి. ఐతే అవన్నీ బయటకు కనపడని చిన్నచిన్న విప్లవాలు. వ్యవస్థఅంతనూ మార్చగలగొప్ప విప్లవాలు మాత్రమే సాహిత్యాన్ని మారుస్తాయి.

గొప్ప గొప్ప విప్లవాలకు సాహిత్యంమీద ఎలాంటి ప్రభావము, పలుకుబడి వుం టాయి? దీన్ని మనం మూడు విధాలుగా విభజించవచ్చు.

(1) ఒక మహావిప్లవం రాబోయేముందు, యించుమించు సారస్వతం అంతా సాంఘిక పరిస్థితులపట్ల తీవ్రమైన అసంతృప్తి. ప్రగాఢమైన నైరాశ్యం వెలిబుచ్చుతుంది.

దుస్సహమైన బాధ, నిశితమైన క్రోధం ధ్వనిస్తాయి. ప్రపంచంలో యిలాటిరచనలు చాలావున్నాయి. అయితే యిలాటి ఆకలికేకలవల్లా ఆవేశపు ఆక్రోశాలవల్లా విప్లవానికి ఒరిగేదేంవుండదు, ఎందుకంటే వట్టి అరుపులకి అంతశక్తిలేదు. నిన్ను అణగదొక్కేవాడు సిగ్గుపడడు. ప్రాణసంకటంలోవున్న ఎలకలు పరిపరివిధాల పరితపించి ఎంతో మంచి సాహిత్యమే సృష్టించవచ్చుగాక, కాని ఆరగించే పిల్లి అవంతా పట్టించుకోదు. కాబట్టి "అయ్యో! అయ్యో!" రచనలూ "ఏడుపులు, మొత్తుకోళ్ల" సాహిత్యమూ మాత్రమే సృష్టించేజాతి ఎన్నటికీ బాగుపడదు. అది అక్కడతోనే ఆగిపోతుంది. కోర్టుకేసులో ఓడిపోయినవాడు చూడండి, తనకి జరిగిపోయిన అన్యాయం గురించి వూరందరితో చెప్పుకుంటూవుంటాడు. వాడిక పైకోర్టుకుపోడని నిశ్చయించుకుని వాడి ప్రతికక్షి నిశ్చింతగావుంటాడు. అలాగే కేవలం ఫిర్యాదు రచనలవల్ల పీశ్చింతకంటె చెయ్యగలిగిందేమీలేదని తేల్చేసుకుని అణగదొక్కేవాడు మరింత నిబ్బరంగావుంటాడు. ఈనిష్ప్రయోజకత్వంగుర్తించి కొన్ని దేశాలు నోరుమూసుకు నీరవంగాపడివుంటాయి. కాని నిజంగా చేవవున్న జాతులు కేవలం మొత్తుకుని లాభంలేదని గ్రహించి, తెలివి తెచ్చుకుని వాస్తవాన్ని గుర్తించి యెదిరించి నిలుస్తాయి. వాటి వ్యథలు ఏడ్పులుగాకాక క్రోధోద్దీపిత గర్జనలుగా తయారవుతాయి. అలాటి సమయంలో వచ్చే సాహిత్యం విప్లవానికి స్వాగతం పలుకుతుంది. అప్పుడు ప్రజలంతా క్రోధంతో రెచ్చిపోయి వుంటారు కనక, విప్లవం బద్దలుకాబోయేముందు వచ్చే రచనల్లో వాళ్ల క్రోధమూ, ఎదిరించాలనే కోరిక, పగతీర్చుకోవాలన్న పట్టుదల ప్రస్ఫుటం అవుతాయి. ఇలాటి సారస్వతమే అక్టోబరు విప్లవాన్ని ఆహ్వానించింది.

(2) విప్లవకాలంలో అసలు సాహిత్యకృషే మరుగైపోతుంది. విప్లవతరంగంలో అందరూ కొట్టుకుపోతారు. మాటలుకట్టిపెట్టి చేతలకుదిగుతారు. విప్లవకార్యక్రమంతో ప్రతివాడూ తలమునకలవుతూవుంటే యిక సాహిత్యవ్యాసంగానికి తావెక్కడ? అంతే కాదు, ఆ సమయంలో ప్రజలు దరిద్రంతో బాధపడుతూవుంటారుకూడా. బతుకు గడవడమే భారమైపోతుంటే యిక రచనలు చేయడమెలాగ? ఇక సాంప్రదాయవాదులు చూద్దామంటే. వారుకూడా మహోద్ధత విప్లవతరంగం తాకిడికి విపరీతంగా క్షుద్ధులై వారికినచ్చే సాహిత్యంకూడా సృష్టించలేక ఉక్కిరిబిక్కిరి అవుతూవుంటారు. "దరిద్రంలోను, బాధలోనే సాహిత్యం పుడుతుందం"టారు కొందరు, ఇది భ్రమ. దరిద్రుడు రచనలుచేయడు. డబ్బులేనిరోజుల్లో నేను అప్పుకోసం అక్కడికీ ఇక్కడికీ తిరిగేవాణ్ణి తప్ప ఒక్కవాక్యమైనా రాయలేదు. పనిబరువుతో సతమతమవుతున్న వాడుకూడారాయ

లేదు. రాయాలంటే ముందాబరుపు దించుకోవాలి, కిఙాతొక్కేవాడు రచనచేయాలంటే ముందారిఞెదిగి కూచోవాలి. బిజీగావుండేవాళ్లు రాయలేరు. మహావిప్లవం జరుగుతున్నప్పుడు మనుషులు చాలాబిజీగా వుంటారు. దరిద్రంకూడా వుంటుంది. ఒక ముఠా యింకోముఠాతో పెనుగులాడుతూ వుంటుంది. అప్పుడు ముందుగా జరగాల్సింది సాంఘిక వ్యవస్థలో మార్పు. అప్పుడు ఎవరికీ రాయడానికి తీరుబడీ ఉత్సాహమూ వుండవు. కనక ఒక మహావిప్లవ సమయంలో సాహిత్యంలో కొంతనిశ్శబ్దత ఆవరిస్తుంది.

(3) విప్లవం విజయవంతం అయాక, సమాజంలో సంఘర్షణ తగ్గుముఖం పడుతుంది. సాహిత్యకృషి మళ్లీ ముమ్మరంగా సాగుతుంది. ఈ కాలంలో వచ్చే సాహిత్యం రెండురకాలుగా వుంటుంది. ఒకటి విప్లవఘనతను కీర్తిస్తూ పొగుడుతూ వుంటుంది. సమాజంలోజరిగినమార్పులు, సాధించిన అభ్యుదయం ప్రగతి కాముకులైన రచయితలందరికీ నచ్చుతాయి కనక వారు గతం సమూలచ్ఛేదం అయిపోతున్నందుకు, కొత్త చిగురొత్తుతున్నందుకూ సంబరపడుతూ యీరకం సారస్వతం సృష్టిస్తారు. ఇక రెండోరకంది పాతఅంతా తగలడి పోతున్నదని గగ్గోలు పెడుతూ రాసేది. కొందరు దీన్ని "విప్లవ ప్రతీఘాతుక సాహిత్యం" అంటారు. అయినా మనం దీన్ని అంతగా పట్టించుకోనవసరంలేదని నేననుకుండాను. విప్లవం విజయవంతమైనప్పటికీ సమాజంలో అంతతొందరగా మారలేనిముసలాళ్లు ఇంకావుంటారు. వాళ్ల చుట్టూ వుండేపరిస్థితులు మారినప్పటికీ వారి పాతభావాలు మారకపోవడంవల్ల, వారు మారిన జీవనపరిస్థితులకు తమ్ము నప్పించుకోలేక గతకాలపు స్మృతులతో పాతని పట్టుకువేలాడుతూ వుంటారు. కాబట్టి తిరోగమన భావాలతో యిలాటి సాహిత్యాన్ని సృష్టిస్తుంటారు. ఈ రచనలన్నీ రచయితల అసంతృప్తిని చాటుతూ చాలా ఏడుపుగొట్టుగావుంటాయి. 'పాత' తుడిచిపెట్టుకపోవడం 'కొత్త' మొలకెత్తడం చూస్తూ వీళ్లు శ్మశాన గీతికలాలపిస్తారు. దీన్ని చూస్తేనే తెలుస్తుంది, విప్లవం జరిగిపోయిందని. విప్లవం విజయం కాకుంటే యీ పాతపిల్లులే అధికారంలో వుండేవి. అప్పుడు మృత్యుగీతాలతో పనేలేదు.

ఇప్పుడు ఇంకా పాతసాహిత్యమే చాలావరకు ఏలుబడిలోవుంది. ముఖ్యంగా పత్రికల్లో అంతాపాతధోరణులే. అంటే విప్లవం యీ సమాజాన్ని చాలాతక్కువగా మాత్రమే మార్చగలిగిందన్నమాట. సాంప్రదాయ వాదుల్ని అది అసలు తాకనేలేదని నేననుకుంటాను. కనకనే పాతధోరణులలో వున్నవాళ్లు వాళ్లమట్టుకువాళ్లు వేరేమన

గలుగుతున్నారు. కొన్ని ప్రాంతాలు పదేళ్ళకిందట ఎలావున్నాయో యిప్పుడూ అలాగేవున్నాయి. కొన్ని ప్రాంతాల్లో అసలు నోరెత్తడమూలేదు, ఎదిరింపు అసలు లేనేలేదు. కార్మిక సంఘాలు మాత్రం ప్రదర్శనల్లో పాల్గొంటూనే వున్నాయి. కాని ఏ విధంగా? ప్రభుత్వం అనుమతితో. అది అణచివేతపై తిరుగుబాటు ప్రదర్శనలుకావు. కేవలం పాలకుల కోరికలమేరకు జరిగే(వినోద) ప్రదర్శనలు. విప్లవం యింకా పూర్తికాలేదు కనకనే మనకు గత వైభవాలకు వగచే మృతగీతాలూలేవు, కొత్తకై గొంతెత్తే విజయ దుందుభులూలేవు.

విప్లవ విజయం వెనువెంటనే కొత్తని మెచ్చుకునే సారస్వతం వస్తుంది కాని, ఆతర్వాత ఎలాటిసాహిత్యం వస్తుందో ఇప్పుడు చెప్పడంకష్టం. అప్పుడు నిజమైన ప్రజాసాహిత్యం వస్తుందని నేననుకుంటాను. ఎందుకంటే విజయవంతమైన విప్లవ ఫలితంగా ప్రపంచం అంతా ప్రజల సొంతం అవుతుంది. ఇప్పుడు ప్రజాసాహిత్యం అంటూ ఏదీలేదు. ఇంచుమించు సారస్వతం అంతా—పాటలు, పద్యాలూ, కథలూ అన్నీ—నిండిన కడుపుల్తో మత్తుగాదొర్లే ఉన్నవాళ్ళ ఊసుపోకకే వున్నాయి. చదువు సంస్కారంవున్న కుర్రాడు బయటపడి బలాదూరు తిరుగుతూ ఓ అందమైన అమ్మాయిని కలుస్తాడు. వాళ్లిద్దరూ ప్రేమలో పడతారు. అప్పుడో అధముడు వాళ్ల మధ్య దూరి గొడవ లేవదీస్తాడు, వాళ్లు ఎన్నెన్నో కష్టాలు పడతారు పాపం! అయితే చివరకి అంతాసవ్యంగానే సర్దుకుంటుంది. ఇలాటివి చదువుకోడానికి ఎంతో హాయిగా వుంటాయి. లేదా ఉన్నవాళ్ల సుఖ సంతోషాలగురించీ, లేనివాళ్ల అపహాస్యపు బతుకుల గురించీ ఎంతో సరదాగా తమాషాగా పుస్తకాలురాయొచ్చు. కొన్నేళ్లకిందట నవయువ తరం కొందరు చలిదేశాల్లో జైల్లోవుండే ఖైదీలగురించి కొన్ని కథలురాసి ప్రచురించేరు. అవి ప్రొఫెసర్లెవరికీ నచ్చలేదు. అలాటి నీచపాత్రలగురించి చదవడం వాళ్లకి చిరాకు అనిపించింది. రిక్షావాళ్ళగురించి పద్యంరాస్తే అది నీచజాతి కవిత్వం. శాసనాన్ని ధిక్కరించేవాళ్ళగురించి రాస్తే అది అధమజాతి నాటకం, వాళ్ల సారస్వతంలో తెలివైన అబ్బాయిలు అందమైన అమ్మాయిలు మాత్రమే పాత్రలు. చదువుకున్న అబ్బాయికి మంచి ఉద్యోగం దొరుకుతుంది, అందమైన అమ్మాయికీ చక్కటి సంసారం అవుతుంది. అలాటి కథలు చదువుకుని ప్రొఫెసర్లంతా అనంద తన్మయులవుతారు. వాళ్లలా హాయిగా వున్నందుకూ, వీళ్లిలా అనంద పారవశ్యంలో వోలలాడుతున్నందుకూ, ప్రజలందరూకూడా సంతోషపడిపోయి తామూ హాయిగానే వున్నామనుకోవాలనిగావల్ను వాళ్ల ఉద్దేశం.

ఇప్పుడిప్పుడు కొందరు రచయితలు శ్రామికుల్ని రైతుల్నికూడా రచనా సామగ్రిగా తీసుకుంటున్నారు. దీన్ని ప్రజాసాహిత్యం అనికూడా అంటున్నారు. కాని అది నిజంకాదు. కష్టజీవి ప్రజలు యింకా నోరు తెరవందే నిజమైన ప్రజాసాహిత్యం ఎక్కడనుంచి వస్తుంది? ప్రజల్ని జీవితాన్ని ఒడ్డునుంచిచూచేవాళ్ల భావాల్ని మాత్రమే తెలియజేస్తాయి యిప్పటి రచనలు. తమ స్వంత మాటల్నే ప్రజలచేత పలికిస్తున్నారు వీళ్లు. ప్రస్తుతం మన రచయితలు ధనికులు కాకపోయినా వీళ్ళు కూలీలకంటె రైతులకంటె కొంత ఎక్కువగా డబ్బున్నవాళ్లే. లేకపోతే వీళ్లు చదువులు చదువుకుని రచనలు చేయడానికే వీలులేకపోయేది. వీళ్ల రచనలు ప్రజలనుంచే పుట్టినట్టు కనిపిస్తాయి కాని యివి ప్రజల నిజగాథలుకావు. జానపద గీతాలు ప్రజలు స్వయంగా పాడుకున్నవి కనుక యివి నిజమైనప్రజాసారస్వతం అవుతాయన్న ఉద్దేశంతో కొందరు రచయితలు యిప్పుడు వాటిని సేకరించి గ్రంథస్థం చేస్తున్నారు. అయితే, సామాన్య ప్రజలమీద పురాణగ్రంథాల ప్రభావం చాలావుంటుంది. పల్లెపట్టులో సామాన్య జనానికి తప్పని సరిగా సంపన్నులపట్ల మెచ్చుకోలువుంది తమకు తెలియకుండానే వాళ్ళ భావాలను కొంత అనుసరిస్తారు. కాబట్టి భావంలోను రూపంలోనుకూడా జానపద సాహిత్యంలో కూడా కొంత సంపన్నవర్గ ప్రభావం వుంటుంది. నేడు మన రచయితలు కవులు అందరు మేధావులు. కూలీలు రైతులు నిజంగా విముక్తి పొందనంతకాలం తమ ఆలోచనల్లో మేధావుల బాటను అనుసరిస్తారు. వీరంతా విముక్తిపొందిన తర్వాతనే నిజమైన ప్రజా సాహిత్యం వస్తుంది. ఇప్పుడే మనకు ప్రజా సాహిత్యం వుందనుకోడం పొరబాటే అవుతుంది.

## భ్రమ

"బలవంతుడు చెప్పడం బలహీనుడువినడం సృష్టిలో ఆదినుండీ సాగుతూ వస్తూన్న ప్రాథమిక సూత్రం. మీ (యజమానుల)కున్న బలమల్లా మాతరపునా మీతరపునకూడా మీరే ఏర్పాటు చేసిన కొన్ని న్యాయసూత్రాలూ, ప్రాథమిక హక్కులూ-అంటే ఆపేరుతో మీ కోసం తీసుకొన్న ప్రత్యేకమైన హక్కులు, అవేవో భగవంతుడుచేసిన శాసనాల్లాగా జనమంతా రాసిచ్చినదాన పట్టాల్లాగా భ్రమపడడం, లోకాన్ని భ్రమ పెట్టడం మీకు పరిపాటయ్యింది. ఇహ కుదరదు. ఆరోజు వెళ్ళిపోయింది. ఆ సంగతి గ్రహించాలి".

—కాళీపట్నం రామారావు

# ఈ కళలెవరికోసం?

బి. సోమేశ్వరరావు

ఏదో ఒకవర్గం ప్రజలకుపయోగపడకుండా ఏపనీ జరగటంలేదు. కళలు, సార స్వతంకూడా వర్గ ప్రయోజనాలకు అతీతమేమీకావు. ఇప్పుడు కళలుగా చెలామణి అవుతున్న చిత్రలేఖనం, సంగీతం, డాన్సు, శిల్పం అన్నీ ఉన్నవాళ్ల వర్గం యొక్క ప్రయోజనానికే ఉపయోగపడుతున్నయ్. సారస్వతంలో లేనివాళ్లకోసం సారస్వతం వచ్చినా అది లేనివాళ్ళదగ్గరకు పోవటంలేదు. లేనివాళ్ళకోసం రాసే రచయితల్ని మెచ్చుకొని ప్రయిజులివ్వడానికి ఉన్నవాళ్ల అకాడమీలు పేరు సంపాయించుకున్న లలిత కళా అకాడమీలు. పరిషత్‌లూ, పూనుకుంటే యీ రచయితలు కాస్త మొహమాటపడ వచ్చును, ఎవరైనా ఊయడం అనేది చేస్తారేమోనని, కాని లేనివాళ్ళ రచయితల అకాడమీలుకూడా ప్రారంభమయితే ప్రయిజులు, అవార్డులు తీసుకోడానికి వెనుదీయ రనుకుంటాను. వున్నవాళ్ళ అకాడమీలకు గండపెండేరాలు, వెయ్యిన్నూటపదహార్లు, దుశ్శాలువలుంటే లేనివాళ్ళ అకాడమీలు, బిరుదులు, పూలదండలు వేసి లేనితనంగా నైనా కీర్తి ప్రతిష్ఠల్ని గరానాగా తెచ్చుకోటానికి వెనుకాడరు. ఈ దుర్దశ రావడానికి కారణం లేనివాళ్లే లేనివాళ్ళనుగూర్చి రాయడంగాని, కళాకండాల్ని సృష్టించడంగాని, లేనివాళ్ళదగ్గరకు వీటిని తీసుకుపోవడంగాని జరగటంలేదు కాబట్టి.

ఇప్పుడు జరుగుతున్న పేదవాళ్ళ సాహిత్యసృష్టిలోను, పేదవాళ్ళకోసం కళల సృష్టిలోను ఉన్నవాళ్లు వస్తున్నారేగాని, అసలు పోవాల్సినచోటికీ కళలు పోవటంలేదు.

విప్లవ రచయితలు విప్లవకళాకారులున్న యీ దేశంలోకూడా, విప్లవం మాస పత్రికలు, వారపత్రికలు, అడ్డుగాలరీలు దాటి పోవడంలేదు. ఆయుధాలుదరించి పోరా డండని ప్రోత్సహించే యీకళాకారులు పోరాడే ప్రజలదగ్గరకుపోరు. పత్రికలు చదివే జనం, పోరాటంలోకి పోలేని జనం, పోరాటమంటే విసుగుకునే జనం దగ్గరకుపోయి 'మేంకూడా విప్లవాన్ని స్మరిస్తున్నాం చూసోక్కండిమరి' అని కాయితంపులులై ఎగురు తున్నారు. ఇదీ కొంతకాలంగా జరుగుతోంది. మరికొంతకాలం జరిగితే జరగొచ్చు.

పోరాటం జరుగుతున్న యీ రోజుల్లో ప్రతి కళాకారుడి యొక్క, ప్రతి రచ యిత యొక్క ధ్యేయాన్ని సవాలుచేయాల్సి వస్తుంది. 'కళాకారుడా! నీవేవైపు నిలబడ

తావు? కూలి ప్రజల వైపునా? కూలి ప్రజలుచేసే పోరాటానికి వ్యతిరేకంగానా? అని ప్రశ్నించుకోవాలి. కూలిప్రజలవైపే నిలబడాలనుకుంటే అతని కళ కూలిసైన్యాన్ని తయారుచేసేదైవుండాలి. కూలివాళ్ళబాదల్ని వివరించి చెప్పడం చాలామంది అభ్యుదయ రచయితలు చేశారు. ఈజీచైరులో కూర్చుని సిగరెట్ పొగలోకి చూస్తూ, 'పాపం కూలివాడి జీవితం ఎంత గోరమైపోయింది? మీరెప్పుడైనా కన్నుతెరవరా?' అని దన వంతులకు మహాజర్లు పెట్టుకోవడంతోనో, ఫోటోగ్రాఫరులాగ లేనివాడిబాదల్ని చిత్రించటంవరకో చేసి వూరుకోవడంతోనో యివ్వాళ కళాకారుడిబాద్యత, ఆవశ్యకత తీరదు.

ప్రజాపోరాటాల్ని పెంచటానికి కూలిసైన్యాన్ని తయారుచేయడానికి తోడ్పడే కళలే కళలు. తక్కిన వెన్నున్నా, ఎంత గొప్పవైనా, అవి లేకపోయినా కూలివాళ్ళ కొచ్చే నష్టమేమీలేదు,

ఈదృష్టితోచూస్తే యిప్పటివరకువచ్చిన కళలన్నీ కూలివాళ్ళకుపయోగపడనివనీ చాలమటుకు ఉన్నవాళ్ళ విలాసాలకేనని తెలుస్తోంది.

కళాహృదయమనేది ఎవ్వడికో ఒక్కడికే వుంటుందని, అదున్నవాడు కాళిదాసులాగ, పికాసోలాగ, జక్కనలాగ కళాకండాల్ని సృష్టిచేస్తాడనే ఉద్దేశ్యం యింకా చావలేదు. వీళ్ళంతా 'స్టైయిలిస్టులు'. ఏదో కొత్తవిదానంలో కళల్ని సృష్టిస్తారు. విషయం మాత్రం కూలివర్గానికి వ్యతిరేకమే.

తాజమహలు ఆర్చీలు, అజంతా గుహలు, రామప్ప గుళ్లు, కోణార్క దేవాలయాలు, వాటి కళాహృదయం దగ్గరనుండి నేడు కడుతున్న గొప్పవాళ్ళ యిళ్ళనమూనాలు ఆర్కిటెక్చరు, కట్టుకునే గుడ్డలు. వాటిమీదవేసే అద్దకాలు, పూవులు, రంగులు, డిజైన్లు, హిప్పీగౌనులు ఎంత పనికిమాలినవో వర్గదృక్పదమున్న ప్రతివాడికీ అర్దమౌతుంది. ఇవన్నీ ఉన్నవాళ్ళషోకులు, ఉన్నవాళ్ళకళలు. ఇవి కూలివాళ్ళవిమాత్రంకావు.

సమిష్టి అవసరం, సమిష్టి ఉపయోగం, సమిష్టి ఆనందం అనేవి కళాలక్ష్యాలు. పూర్వం యీ దోపిడీ సమాజం పుట్టకపూర్వం, ఆదిమమానవుడు గుహల్లోఉన్నా, అడవుల్లో నివసిస్తున్నా, కమ్యూన్ జీవితాన్ని అందరం ఒకచేననే జీవితం గడుపుతున్న రోజుల్లో, వ్యక్తిగతమైన ఆస్తిలేనిరోజుల్లో, పీడించి ఆస్తి పెంచటం అనేవి తెలియని రోజుల్లో కళలున్నయ్. అవి పూర్తిగా సమాజ ఉపయోగమైనవిగా ఉన్నయ్. వాళ్ళకు యిప్పుడున్న రంగులు, కుంచెలు, కాయితాలు, సిరాలు, షాణాలు, ఉలులు లేవు.కాని వాళ్లు నిర్మించిన ప్రతి కళారూపం వాళ్ళ కమ్యూన్ జీవితాన్ని బాగుపరిచేదిగా

ఉంది. ఆ కమ్యూన్‌లో ఏ ఒక్కరి జీవితం బగవంతుడిచ్చిన వరప్రసాదంకాదు. అప్పటికింకా బగవంతుడు పుట్టలేదు. జీవితమంటే ఎవ్వరికీ ఒంటరిదికాదు. అందరితో కలిసి అందరు శ్రమించి వేటాడి పొందిన పలితాన్ని అందరితోకలిసి అనుబవించటమే జీవితం. ఒక్కడిగా ఎవడూ బ్రతకలేని దశ. ఒక్కడిగా జీవితాన్ని తన ఒక్కడి కోసం నిర్మించుకోలేనిదశ. ఒక్కడిగా యితరుల్ని విడిపోయి బ్రతకటమంటే చావుగా ఆలోచించేదశలో కమ్యూన్‌లో ప్రతిమనిషి అందరికోసం చేస్తాడు. కటినమైన పోరాటంతో ప్రక్రుతితో క్రూరజంతువులతో పోరాడే అతి కష్టమైన జీవితం అనుబవిస్తున్న ఆనాటి మానవుడుకూడా కళల్ని స్రుష్టించాడు. అతిప్రాచీనమైన కళారూపాలుగా పేరు పొందిన చిన్నిచిన్ని 'వీనస్' దిసమొలల ఆడవాళ్ళబొమ్మలు. యిటలీలో సావింగ్నానో గుహలో, ప్రాన్సున లస్పూగ్‌గుహలో, రష్యాలో కరస్కుదగ్గర అవడేయెవో గుహలో, మొరేవియాలో, చెకోస్లోవికియాలో బయటపడినై. ఈ ఆడబొమ్మలకు తల, కాళ్ళు, చేతులు సరిగా వివరంగా లేవుగాని పెద్దపెద్ద స్తనాలు బలిసిన తొడలు బొమ్మకుమించి వివరంగా చిత్రించారు. అప్పటి కమ్యూన్ ఆశయం జనంపెరగటం, జనం పెరగటానికి ఆడవాళ్ల ఎక్కువమంది తల్లులు కావాలి. 'తల్లి'ని ప్రచారంచేసే అవసరానికి కళారూపాలవి. వేటాడేవాళ్ళ జీవితావసరానికి, ఎక్కువ వేటాడి ఎక్కువ ఆహారాన్ని పొందాలంటే, క్రూరమ్రుగాలతో ఎంతో పోరాడవలసివుంది. ఆ పోరాటానికి కమ్యూన్‌ను ఉత్సాహపరచటానికి గుహల్లో మ్రుగాల బొమ్మలు వేసి వాటిని బల్లాలతో గుచ్చి పోరాటపు ఆవేశాన్ని పెంచే తంతు, మాజిక్కు ఏర్పాటుచేసేవారు. యీ తంతుకు గుహల్లోగీసిన బొమ్మలు జీవితావసరాలు. ప్రాన్సులో గోర్డాన్, ట్రాయిస్, ఫ్రెరీస్ గుహల్లో ఎలుగుగొడ్డు బొమ్మలకు రక్తం రాసి బాణాలు గుచ్చినట్లు చూపుతున్న పెయింటింగులు యిలాంటివే. యిప్పుడున్న ఆదిమజాతులలోఉన్న కళలు కూడా సమిష్టి జీవితావసరాల కుపయోగపడేవేకాని, వ్యక్తి విలాసానికి సంబంధించినవి కావు. ఆదిమజాతుల్లోఉన్న ఆటలు, పాటలు, డాన్సులు జీవితావసరాలు మాత్రమే, ఎస్కిమోలు 'సీల్' జంతువును వేటాడేరీతిని ఆ తెగ పిల్లలకి తెలియజేయడానికి వేటాడిన వీరులు 'సీల్' ఎలా పాకుతుందో, ఎలా తప్పించుకుంటుందో చివరికి దాన్ని ఎలా వేటాడాడో అన్నీ అనుకరిస్తూ వేటను డాన్సురూపంలో అడుతారు. దీనిమూలంగా ఎలా వేటాడాలో నేర్చుకుంటారు తెగలో పిల్లలు. 'బగోబోస్' అనే తెగ ప్రజలు వ్యవసాయపు డాన్సు చేస్తారు. విత్తటానికిముందు విత్తడం డాన్సు చేస్తారు. దాంట్లో విత్తటాన్ని అనుకరిస్తూ డాన్సు చేస్తారు. కోయడానికి కోసేడాన్సుచేసి దాన్నే పాటగాపాడి ఆ పని చేయాలనే ఆవేశాన్ని ఆనందంగా మార్చి పనికి పురికొల్పే జీవితావసరాలే యీ

డాన్సులు, పాటలుకూడా. ఆస్ట్రేలియాలో ఆటవికులు తమ పిల్లలకు యితర తెగల తోటి యుద్ధాన్ని ఆటలతో చూపి యుద్ధాన్నిచేసే నేర్పును ప్రోత్సహిస్తారు. ఉత్తర అమెరికాలో ఎర్రయిండియన్లు ఎద్దును ఎలా వేటాడాలో డాన్సుతో చూయిస్తారు. యితరతెగలతో పోరాడి తమ తెగన్ని రక్షించిన వీరుల్నిగూర్చి పాటపాడతారు.

ఆఫ్రికాలో వొంటిమీద బురదరాసుకునే తెగలు చాలఉన్నయ్. దోమల బాద నివారణకు మొదట బురదరాసుకునేవారు. తరువాతదే పాషనైపోయింది. ఎర్రయిండియన్ల వంశశ్రీమాన్ని సూచించటానికి మొదట పచ్చ బొడిపించుకునేవారు. తరువాత ఆ అవసరం పాషనైపోయి మనదాకావచ్చింది.

సమాజం సమిష్టి శ్రీమ, సమిష్టి అనుభవం, సమిష్టి ఆనందం అనే మహోన్నతమైన జీవితవిధానంనుండి వేరుపడి సొంతఆస్తులు ఏర్పడి వ్యక్తి ఆనందం, వ్యక్తి గొప్పదనం, పీడించటం ఏర్పడ్డాక యీ కళలు పెద్ద మలుపు తిరిగాయి. జీవితావసరాన్ని వదిలి ఉన్నవాడి పొట్టను ఆశ్రయించుకున్నయ్. శ్రీమ సమిష్టి శక్తిగా గాక దోపిడీకి నిలయమయ్యాక సమిష్టి కళలు, వ్యక్తి జీవితపు అనవసరమైన అధిక సుకలాలసతగా పతనమైపోయినై. సుకం, శాంతి కొంత మందికే ఎక్కి తొక్కినట్లు ఎక్కువైపోగానే, యీఅతిసుకాన్ని మత్తుగా ఆనందించటానికి పాత్రలైనయ్యీకళలు. ఆకలి లేకపోయినా రుచికోసం ఎక్కువగా తినటానికి కరీదైన యింపైన కళాత్మకమైన పళ్లెములు సృష్టయినై. కాపీ యిరవై పైసలయినా అరవై రూపాయల కాపీ కప్పులు కళాత్మకంగా తయారవుతున్నయ్.

పనిజేసేవాడికి పొట్ట పెరగదు. పనికి తగినట్లు శరీరం పెరుగుతుంది, అలా తగిన శరీరం పెరిగి పనిని సునాయాసం చేస్తుంది. లాగుడుబండ్లవాళ్ల బలమైన జబ్బలు, గొడ్డలితో కట్టెలు కొట్టేవాళ్ళ గట్టిఛాతి, మట్టిమోసే ఆడవాళ్ళ కొవ్వులేని నడుములు, చంకలు చాలా అందంగా సహజంగా ఉంటయ్. అలాపెరిగినవాళ్ళ అవయవాలతో ఎక్కువ పని చేయగలరు. తినికూర్చునే జనానికి పొట్టతగ్గటానికి కండలు పెంచటానికి, దండాలు బస్కీలు, ఆసనాలు, లోడీలు తిప్పడం డబ్బు ఉన్న ఆడవాళ్ల స్తనాలు పెరగటానికి ప్రత్యేక బస్కీలు, మర్దనలు, వాళ్ళ తొడలు పిర్రలు నునుపు కావడానికి కొత్తపట్లు నేర్పే కళాత్మక రూపాలు తాలెంకానాలుగా, జిమ్నాషియాలుగా అర్ధుల్లాగా, బ్యూటీ అర్ధులులాగా వచ్చేశాయి.

కామ అవసరాన్ని ఆరోగ్యంగా తీర్చుకోటంలో ఆనందం పొందటం ఒక అవసరంగాకాక బలిసినవాళ్ళు ఆ చక్కిలిగింతను యింకా పొందాలి, యింకా పొందాలి

అని కామకళనుద్దరించి దేవాలయాలమీద, న్యూడ్ పెయింటింగ్స్‌లో. అసహజంగా, కామతృప్తిని తీర్చుకోటానికి చూచారు,

బావంతో ఒక అవసరంతో అందరూ కలిసి ఆనందంగా పాడుకొనే పాటలు పోయి కేవలం సంగీతంకోసమే పాటలైపోయి 'గరిగరిసరిగరి' అని అక్షరాల్తో పిల్లి మంత్రాలు కొట్టేదే ఒకకళగా మారిపోయింది.

సమిష్టి జీవనంలో చేయబోయేపనిని, లేక చేసిన గొప్పపనిని ఆనందంగా డాన్సుచేసే విదానాన్ని కామకలాపాలకు, దేవుళ్ళ కతలకు రొమ్ముదరువులకు నిలయంగా ఆడవాళ్ళ అంగాలమీద డాన్సు ఒక కళగా నిలిచిపోయింది.

ప్రజావసరాలుగాఉన్న కళలు, సమష్టి జీవితంలో బాగంగాఉన్న కళలు, సమిష్టి జీవితం పోయేసరికి కళలుకూడా జీవితంయొక్క అవసరానికి మించి వెర్రి తలలువేసి దోపిడీ వర్గానికి బంటులై పోయాయి. యీ వెర్రికళలే యివ్వాళ మనకు శిరోదార్యం కాకూడదని చాలామంది అనుకుంటాం, చొక్కాల కాలర్లు పెంచటం, టైట్ పాంట్లు, చంకలవరకు జాకెట్లు, స్తనాల్ని లేపిచూపే 'బ్రా'లు, లిప్‌స్టిక్‌లు, హిప్పీ బెల్టులు, ఆడ రిస్టువాచీలు. మగరిస్టువాచీలు, ఆడవాళ్ళ జలతారు చెప్పులు, పూజించే దేవుడి బార్యకుకూడా రొమ్ముమీద గుడ్డలులేని శిల్పకళావిన్యాసాలు పోవాలని యివ్వాళ మనం ఎన్ని సంస్కరణలు తీసుకొచ్చినా దోపిడీచేసేవాడి కళలు, సంస్కృతులే చలామణవుతై. వీటిని సంస్కరించాలనే వాదాలకన్నా, యీ పిచ్చి కళలకు మూలాదారమైన దోపిడీ విదానాన్ని నాశనం చేయడానికి పోరాటం జరపాలి. ఆ పోరాటాన్ని ముందుకు తీసుకొని పోవడానికి ముక్యంగా పోరాటయోదుల్ని తయారుచేయడానికి కళలు, కళాకారులు క్రుషిచేయాల్సిన తరుణమిది.

యిప్పుడు నడుస్తున్న జీవిస్తున్న కళలన్నీ దోపిడీవర్గం యొక్క కళలు. యీ కళలన్నీ ఉన్న వర్గంయొక్క వివిద అవతారాలే. దోపిడీలేని సమాజంవస్తే కళయొక్క రూపం మళ్లా సమాజంలో సమిష్టిరూపం దాల్చి సమాజ అవసరంగా తయారవుతుంది. అలా చేయడానికి ప్రతి కళాకారుడూ ముందు యీ పనికిమాలిన కళల్ని నాశనం చేయడానికి పూనుకోవాలి.

కూలీల పోరాటానికి అవరోదంగానిల్చిన దేవుడు, ఆస్తి, కర్మ, వ్యక్తి సుకాల్ని నాశనం చేయాలనుకుంటున్న యీ రోజుల్లో, ప్రస్తుతపు కళానిలయాలైన గుళ్లు, పెద్ద పెద్ద పనికిమాలిన ఆర్కిటక్చర్లు, పాతవైబవాలను కొనే రాజుల కోటలు, శిల్పాలు, న్యూడ్‌బొమ్మలు, అబ్‌స్ట్రాక్టు ఆర్టు గాలరీలు, సినిమాలు అన్నిటిని ముందు నాశనం చెయాలి.

# రెడ్ శాల్యూట్ !

దుష్యంత బాబు

రెడ్‌శాల్యూట్ రెడ్‌శాల్యూట్
అమరవీరసింహాలకు రెడ్‌శాల్యూట్
పీడిత తాడిత జనాల
ఎర్రెర్రని శాల్యూట్

అడవుల్లో కొండల్లో
ధనస్వామ్య శత్రుమూక
బండరాతి గుండెల్లో
భయద గర్జనలు సల్పిన
అమరవీర సింహాలకు
ఎర్రెర్రని శాల్యూట్

మందికొరకు డెందాలను
బాయ్‌నెట్ మొనకెదురొడ్డిన
సుందర సురుచిర సమతా
మందిర నిర్మాణానికి
రక్తతర్పణం చేసిన
అమరవీర సింహాలకు
రెడ్ శాల్యూట్

శ్రీకాకుళ గిరిజనాళి
వెన్నుతట్టి. మేలుకొల్పి
ఎర్రసేనగా తీరిచి
దోపిడి కూటమి కుత్తుక
ఉత్తరించ నడిపించిన
అమరవీర సింహాలకు
ఎర్రెర్రని శాల్యూట్

కామ్రేడ్ ఓ సత్యం
క్రిష్ణమూర్తి కైలాసం
'ఎరుపు' కవీ, కవీ రవీ
అమ్మా నిర్మలత ల్లీ
మీరంతా మీరంతా
మహోన్నత మానవతామూర్తులు
అన్నార్తుల చీకటి ఎదఎదలో
వెలుగుతున్న అరుణారుణ ప్రదీపాలు
వర్గశత్రునిర్మూలన
మహదాశయ పరిపూర్తికి
మీరంతా రగిలించిన
రక్తజ్వాల లారలేదు
శత్రుదుర్గ శిఖరమంటి
జ్వలిస్తోంది విప్లవాగ్ని
మీ అడుగుల జాడలంటి
వేసవేలు మేమంతా

రెడ్ శాల్యూట్ రెడ్ శాల్యూట్
అమరవీర సింహాలకు రెడ్ శాల్యూట్
పీడిత తాడిత జనాల
ఎర్రెర్రని శాల్యూట్.

---

"రక్తంలో నడుస్తుంది
హింసనుంచి
విముక్తిదాకా
అవిచ్ఛిన్నంగా— విప్లవం".

—పాశ

## ఎర్ర పిడికిలి

కె. వి. రమణారెడ్డి

కలలుకంటూ కవితరాస్తూ
కలను మెలకువతోపెనేస్తూ
అడివిపిట్టకు బదులుచెబుతూ
పాడుతూ పోరాడుతుంటివిగా!

పళ్లలోపల దొండపండూ
పూలలో మందారపువ్వూ
పేరునీదీ తలచుకొంటే
గుర్తువస్తే ఎర్రి ఎర్రింగా!

చెప్పినవు స్నేహానికర్థం
చూపినవు త్యాగాలమేర
నేర్పినవు విప్లవం ధర్మం
జ్వాలనువ్వే జ్యోతి నువ్వేగా!

గుండెలో దాసానిపువ్వూ
గొంతులో గోదారినవ్వూ
చిగురుమాటా చేవచేష్టా
విత్తునువ్వే చెట్టునువ్వేగా!

మంచితనమే శిల్పకళగా
మనస్సొక రామప్పగుడిగా
అడవిపై నెలపొడుపువెలుగై
అలవునువ్వే జెలవునువ్వేగా!

అడివిదున్నలు కుమ్మినాయో
ఆడివిమనుషులు పొడిచినారో
వెన్నెలో చీకటో తెలియని
వేళలో నువు పట్టుబడ్డావో?

అడివిదున్నలు కుమ్మలేదు
అడివిమనుషులు పొడవలేదు
రక్షణో భక్షణో తెలియని
రాక్షసులు నీ వుసురు తీశారే!

విరిగిపోనీ ఎముకఉందా
విహ్వలించని కండఉందా
ఒళ్ళుసాంతం పచ్చిపుండై
ఒరిగి నేలకు వాలిపోయిందా?

కత్తికెక్కడిదయ్యా కరుణ
కక్షకెక్కడిదన్న జాలి
పిరికిగుండెల యమలవాళ్ళకు
ప్రాణులంటే తగనిభయమయ్యా!

ఖాకిదుస్తుల కాకిమూకలు
ముక్కుతో దొండనేపొడిచీ
ఉక్కుగోళ్లా మురికిగెద్దలు
నొక్కిమందారాన్ని చీల్చాయా?

ఒంటినిండా ఎర్రిజెండా
ఉదయసంధ్యే కప్పివేస్తే
గాయమే కనిపించకుండా
అడవికొమ్మలు రెమ్మలిచ్చిందా?

ఒత్తుకున్నాం కంటిచిత్తడి
ఎత్తుతున్నాం ఎర్రిపిడికిలి
సత్యమెన్నడు చావదంటున్నాం
నీ కీర్తిమూర్తే తరగదంటున్నాం!

## జనసంగీతం

చెరబండరాజు

పోరులో నినుచంపినారా
దారిలో నిను పట్టినారా
ఏటికే ముకుతాడువేసే
ఎర్రి మొర్రి ముండకొడుకులు
ఎద్దునాయకులింక బతకరు

సోదరా ఈదారిలో ఇక
విశ్రమించము విశ్రమించము

ఈతముళ్లే గుచ్చినారా
చేతివేళ్లే నరికినారా
నేలకొరిగిన వీరపుత్రుల
నెత్తురే జెండాగమారును
జయము జనసంగీతమవునూ —సోదరా

కనుగుడ్లు కాకులకేసినారా
వెకిలినవ్వులు నవ్వినారా
అడవిమంటలు ఆర్పుటకు
ఏ వాన మబ్బులు నిలిచికురియును
చలికి నిప్పెవరార్పుకొందురు —సోదరా

ఒక్క చెట్టుకు వేలకొమ్మలు
కొమ్మకొమ్మకు కోటిపూవులు
చావుతో జననాలు ఆగవు
చీకటింటికి చిచ్చుపెట్టే
శిశువులపుడే పుట్టినారూ —సోదరా

నవల:

# నా కుటుంబం

టావ్‌చెంగ్

['నా కుటుంబం' జనచైనా రచయిత్రి టావ్‌చెంగ్ కుటుంబ యధార్థ గాధ. ఆ ఒక్క కుటుంబగాధే కానక్కర్లేదు. అరవైకోట్ల ప్రజల విముక్తి కోసం సాగిన విప్లవ పోరాటంలో కష్టాలు, కడగండ్లు సహించి త్యాగాలుచేసిన వేలాది కుటుంబాల వీరగాధలకిదొక మచ్చుతునకమాత్రమే. చైనాలోనేకాదు ప్రపంచంలో ఏ గడ్డమీదనైనా విముక్తి కోసం సాగే విప్లవపోరాటాల్లో మన ప్రతి అడుగు మన వీరుల రక్తతర్పణాల్లోంచే వేయాల్సిరావచ్చు. ఒక్క కామ్రేడ్ ఒరిగిపోతే, ఆ లోటును భర్తీ చేయడానికి నూరుమందిలేస్తారు. చని పోయినవాళ్ళను ఓవైపు పాతేస్తూ యింకోవైపు యుద్ధాన్ని ముందుకు తీసుక పోవాల్సివుంటుంది. విప్లవవీరుల అమరగాధలనుంచి ఉత్తేజాన్ని పొందినపుడు యీ అవగాహన మరింత బలపడుతుంది. ఈ నవలను యీ నెలనుంచి ధారావాహికంగా ప్రచురించి సృజనలో పూర్తికాగానే పుస్తకరూపంలో తేదల్చాం.

—సంపాదకుడు.]

## 1

నలభైయేడు ఏండ్లనాటిమాట. ఉదయం నా పెంపుడుతల్లి నాకు తలదువ్వుతూ, దుస్తులు మారుస్తూ, పూలుపెడుతూ ఎంతో హడావిడిపడుతూవుంది. పెండ్లిముహూర్తం నా పదిహేడో పుట్టినరోజూ కలిసొచ్చాయి. పల్లె ఆచారప్రకారము నేనారోజు శాకా హారమే తీసుకోవాలి. ఇది నన్ను పెంచి పెద్దచేసిన నా తల్లిపట్ల కృతజ్ఞతచూపడమట.

నా కాబోయేభర్త యేదో చేతబడిప్రభావంవల్ల కొన్ని నెలలుగా జబ్బుగావున్నట్లు చెప్పింది నా పెంపుడుతల్లి. వధువు పల్లకి[1] ఎప్పుడువస్తుందా, ఈ దయ్యాలప్రభావాన్ని ఎప్పుడు పారదోలుతుందా అని ప్రతివారూ ఆదుర్దాగా ఎదురుచూస్తున్నారు.

పెండ్లి సమీపిస్తున్నట్లు సూచించే చిహ్నాలేవీ ఆ ఉదయం కనబడలేదు. బంధు మిత్రులుగాని మరి యేయితర అతిథులుగాని లేరు. నా పెంపుడుతల్లే నాకు సంబంధిం

కుర్చీ [1]

చిన అన్నివిషయాలూ చూస్తూఉంది. రెండోయేటనే అనాధనైన నాకు నా మేనమామ (సర్జన్‌ఆయన) తప్ప మరేదిక్కూ లేదు. వృత్తిరీత్యా ఆయన ఊరూరూ తిరుగవలసి వచ్చేది. అందుకే మా పొరుగింటావిడకు అప్పగించాడునన్ను. ఆమె నాపెంపుడుతల్లి. మామయ్య ఎప్పుడోగాని కనిపించేవాడుకాదు. అందుకే నా బాల్యమంతా నా పెంపుడు తల్లితోనే గడిచిపోయింది. ఆమే నన్ను కుట్టుపనినేర్చుకోడానికి పంపించింది. ఆమే నాకు సంబంధంచూచింది; నా పెండ్లికి కావలసిన సరుకు సరంజామా, దుస్తులు వగైరా అన్నీ సమకూర్చిందామే— ఈ లోకంలో ఆమే నా సర్వస్వం.

"మామయ్యింకా ఎందుకురాలేదో?"

"ఇదివరకే కబురుపంపానమ్మా. ఈపాటికి వస్తూవుండాలి."

అకస్మాత్తుగా పెండ్లిమేళంచప్పుడు వినిపించింది. వధువు పల్లకిద్వారం ఎదుట ప్రత్యక్షమైంది. నాకేదో నరాలపట్టుతప్పి మైకంకమ్మింది, గుండె ఆగినట్లనిపించింది. వీడ్కోలు సమయంలో అమ్మ నన్ను పెల్లుబుకుతున్న దుఃఖంతో కౌగలించుకుంది. తరువాతేంజరిగిందో నాకు సరిగా గుర్తులేదు. నాకు జ్ఞాపకమున్నవిషయం ఇంకొక్కటే. మామయ్య ఎక్కడినుంచో అనుకోకుండా ఊడిపడ్డాడు. మారుమాటలేకుండా నన్ను పల్లకిదగ్గరికి లాక్కెళ్లాడు. మామయ్య ఎన్నోరోజులుగా తాగుతున్నాడని తెలిసింది. ఇప్పుడు బాగా వాసనకొడుతూఉంది.

పల్లకీలో చీకటిగాఉంది. నాముఖానికివేసిన ముసుగు ఊపిరిసలుపనివ్వడంలేదు. బోయీలు ఎగుడుదిగుడుబాటలో కుదుపుతూ మోస్తున్నారుపల్లకిని. వీటన్నిటివల్ల కండ్లు తిరిగినట్లైంది. ఇట్లా సుమారు 10 లీలు (దాదాపు 3½ మైళ్లు) పయనించి పట్టణంలోని ఒక యిరుకుసందులో ఆగాం. అప్పుడు మొదలైంది బాధాకరమూ సుదీర్ఘమూ అయిన పెండ్లితంతు. ఈ ఉత్సవంలో నేను కేవలం ఒక తోలుబొమ్మను. భూదివమ్ముల దేవతలకు సాష్టాంగపడవలసివచ్చింది. ఎంతో తంతు జరిగింతరువాత పడకగదిలోకి వెళ్ళి మంచంపైన కూర్చోవలసివచ్చింది. పెండ్లి టీమార్పిడి సమయంలో ఓ చిత్రం (వింత) జరిగింది. బల్లమీద ఖర్జూరాలూ, బటానీకాయలూ, తామరగింజలూ ఎన్నో చిత్రవిచిత్రమైన తినుబండారాలు పరచిఉన్నాయి. కొత్తచోటు కావడంవల్ల ఏదో బెదురు, అయోమయం కలిగాయి. ఆ అయోమయంలో చేతికిచ్చిన వస్నీ టెంకె, పొట్టులతో సహా నోట్లోవేసుకొని మింగాను. పెండ్లికొడుకును దొంగగా ఓరగాచూశాను. గంభీరంగా తొణుకుబెణుకులేకుండా ఉన్నాడు. పనికిరాని పొట్టుతొక్కలు అక్కడిప్లేటులో

పడవేస్తున్నాడు. "అదిగో పెండ్లికూతురు నవ్వుతూందర్రా" అన్నారెవరో. అందరూ ఒక్కుమ్మడి ఉత్సాహంతో ఖుషీగా అట్టహాసంగా కాళ్లు నేలకుతాటిస్తూ విరగబడినవ్వారు.

అకస్మాత్తుగా పెండ్లికొడుకు తూలాడు. మూర్ఛవచ్చినవాడిలా తన్నుకున్నాడు. ముఖం పాలిపోయింది. ఎంతో మంది వచ్చి అతణ్ణి ఎత్తుకుపోయారు. వివాహం అప్పటికప్పుడే అంతటితోనే ముగిసింది.

ఆ రాత్రి శోభనపుగదిలో నేనొంటరిగానే గడిపాను. నా రాక నా భర్తనుపట్టిన దయ్యాలను పారదోలకపోగా ఆనాటి ఉత్సవ ఆర్భాటంతో ఆయన పరిస్థితి మరీ విషమించినట్లనిపించింది.

నాభర్త ఉయాంగ్ మై-షెంగ్ నాకంటె ఒక సంవత్సరంచిన్న. అతనికీ చిన్నతనంలోనే చాంగ్‌షా ప్రాథమిక పాఠశాలలో చదువుకునే రోజుల్లోనే తల్లిదండ్రులు గతించారు. వాళ్ల అవ్వే పెంచింది.

పెండ్లికాగానే ఇంటిబరువుబాధ్యతంతా నామీదేపడింది. అవ్వ చండశాసనురాలు. ప్రతి చిన్నవిషయానికీ పెద్ద రభసచేసేది. బియ్యంకడిగేటప్పుడు పొరపాటున ఒక్క గింజైనా కిందపడిందా ఇక మొదలు ఆ ఒక్కగింజపట్టుకొని ఇరుగు పొరుగమ్మలంతా వినేటట్లు, "ఇట్లాంటి ఉల్పాపారబోతలీ ఇంట్లో మళ్లీకాగూడదు ..." అంటూ అరచేది. పొయ్యిలో ఒక్క కట్టెపుల్ల ఎక్కువపెట్టానంటేచాలు. "తేరగారాలేదు, చెమటోడ్చిన డబ్బుతో తెచ్చానాకట్టెలు." అంటూ గొంతుచించుకునేది. ఆమెఅంటే హడలెత్తేదాన్ని.

ఎంతైనా మై-షెంగ్‌కు నా యిబ్బందిపట్ల సానుభూతిగానే ఉండేది. అవ్వలేనిది చూచి నన్ను ఓదార్చేవాడు.

"ఇదిగో. అవ్వ ముసిల్ది, నువ్వామె మాటల్ని పట్టించుకోకూడదు. ఏం ఫరవా లేదు, ఆమె అంటే భయపడేపన్లేదు" అంటూ గుసగుసలాడేవాడు.

ఇదంతా మేకపోతుగాంభీర్యం. అవ్వ ఎదుట నోరెత్తేవాడుకాడు.

అవ్వ గదికి రోజుకు మూడుసార్లు వెళ్ళి వందనం చేయటం ఆమె క్రమశిక్షణా నియమాల్లో ఒకటి. మై-షెంగ్ ఎప్పుడైనా పాఠశాలనుండి తిరిగివచ్చి అవ్వను పలుకరించకుండా చక్కగా తనగదిలోకి వెళ్లాడా పిచ్చికోపమొచ్చేది. రోజులతరబడి మూగనోముపట్టేది. నాకిప్పటికీ బాగా జ్ఞాపకం సాయంత్రాల్లో నిశ్చలంగాకూర్చుని రుద్రాక్షమాలలో పూసలుతిప్పుకుంటూ ఏదో పెద్దమునీశ్వరుడిలా కండ్లుమూసుకొని జపంచేసేది.

గత్యంతరంలేక మేమూ బొమ్మల్లా కూర్చోవలసి వచ్చేది. కదలడానికి గుండె చాలేది కాదెవరికీ.

ఒకసారి నిద్రబాగా ముంచుకొచ్చింది. సరిగ్గా ఆపుకోలేక నోరుతెరిచి ఆవలించే సమయాన అవ్వ కండ్లు తెరిచింది. నావైపు ఒక్కసారి రౌద్రమైన కోపపుచూపు విసరి మళ్లీ జపంలో మునిగిపోయింది. ఇదే అదనని మై-షెంగ్ నావైపు చిత్ర విచిత్రపు భంగిమల్లో ముఖంచిట్లిస్తూ 'ఖబర్దార్'అన్నట్లుగా చూసాడు. నాకు తన భావాలు సరిగ్గా బోధపరచలేక, తన్ను తాను నిగ్రహించుకోలేక నవ్వసాగాడు.

'ష్‌ష్‌ష్... ' అంటూ అవ్వ కోపంగా బుసకొట్టేది. 'ఎంతనిర్లక్ష్యం!' అంటూ వెళ్ళిపోండంటూ కోపంగా చెయ్యి ఊపుతూ ఆజ్ఞాపించేది కండ్లుమూసుకునే.

అనుకోకుండా పంజరంలోనుండి విముక్తి పొందిన పక్షుల్లా పారిపోవడానికి సిద్ధమయేలోగానే "అనవసరంగా అర్ధరాత్రివరకూ కూర్చొని దీపంనూనె తగలబెట్టకండి" అంటూ ఒక ఆర్డినెన్సు జారీచేసేది.

అవ్వది పైకి పాషాణంలాకనిపించినా వెన్నలాంటిమనసు. ఉత్సాహంగా వున్నప్పుడు బాదం పప్పు. బటానీలూ యింకా ఎన్నో ఎన్నో తినుబండారాలు పెట్టేది. 'హుఁ.... జీవితమంటే ఎలాంటి సమరమో ఉడుకునెత్తురువాళ్లు మీకేం తెలుస్తుంది' అంటూ నిట్టూర్చేది.

మా పెండ్లిఅయిన రెండవఏట లి-యాన్ పుట్టాడు. వాడిరాకతో ఇంటిపని ఎంతో పెరిగింది. అవ్వ, చిన్నవాళ్లమైన మాకు పిల్లల పెంపకం ఏంతెలుసులే అని, వాడి భారమంతా తానే వహించింది. అంతటితో అవ్వప్రార్థనలూ, జపాలూ మూలపడ్డాయి. దురదృష్టవశాత్తు అవ్వ "అవ్వా!" అనేవాడి పిలుపు వినకుండానే వెళ్లిపోయింది. మృత్యుశయ్యపైఉండి వాణ్ణెంతో సున్నితంగా గుండెకు హత్తుకుంది. బహుశ వీణ్ణి వీడిపోవలసివస్తున్నదికదా అనే దుఃఖమే ఆవిడగుండెను తొలిచిందేమో.

తన పరలోకయాత్ర సుగమంకావడానికిగాను కొందరు బౌద్ధభిక్షులకునాహ్వానించి మూడుదినాలపాటు రాత్రింబవళ్లు "వజ్రసూత్ర పఠనం" చేయిస్తే మంచిదని చనిపోవడానికిముందు తన అభిప్రాయం వెలిబుచ్చింది.

అవ్వ పోయింతర్వాత కుటుంబ పరిస్థితి నానాటికీ దిగజారింది. దహనసంస్కారాలు గొప్పగా చేయడానికి ఉన్న కొద్ది నేలకుంటతోసహా అమ్ముకోవలసి వచ్చింది.

అప్పటికీ అప్పులేమిగిలాయి. ఇంకో యిద్దరుపిల్లలు వెంటవెంట కలిగేసరికి అప్పుల్లో నిండా మునిగాం. అయినా మై-షెంగ్ కుటుంబంలో సంఖ్య పెరిగినకొద్దీ సంతోషపడే వాడు. "హాయ్.... మరో రుణదాతవచ్చాడ్రా" అంటూ నిష్కల్మషంగా ఉత్సాహపడే వాడు. అతిణ్ణి నిరుత్సాహపరచేదీ, నీరుగార్చేదీ ఏదీ ఉండేదిగాదు.

ఈకాలంలోనే మై-షెంగ్ ఎలాగో ఒక ప్రైవేట్ ట్యూటర్ ఉద్యోగంసాధించాడు. కాని దానివల్లగిట్టేడబ్బు ఇంటికేమాత్రమూ సరిపోయేదికాదు.

నేను పిల్లలతోపాటు చాంగ్షా పట్టణంలోనే ఉంటూ కుట్టుపనిద్వారా కొంత డబ్బు సంపాదించేదాన్ని. పదమూడేండ్ల వయసులోనే నేను ప్రఖ్యాతమైన యాంగ్ చి-టాంగ్ హూనాన్ ఎంబ్రాయిడరీ స్కూల్లోచేరి రెండేండ్లు చదివాను. ఆ రోజుల్లో ఆఫీసర్లు, మధ్యవర్గీయులే మా పోషకులు. సున్నితమైన పనితనానికి బాగా ముట్టజెపు తుండేవారు. ఈ చేతిపనిలోని మెలకువలన్ని తెలిసిన నేర్పరులు యాంగ్‌వంశమువారు. ఒక కన్నుకుట్టడమో లేక బహుసన్నని బొచ్చుకుట్టడంలోనో బహునేర్పు ప్రదర్శించే వారు. ఈ నైపుణ్యమంతా పారంపర్యంగా ఒకతరంవారినుండి తరువాతి తరంవారికి సంక్రమించేది. మిక్కిలి సున్నితమైన, క్లిష్టమైనపని ఒక ప్రత్యేకమైనగదిలోకూర్చొని ఆ ఇంటికోడలే చేసేది. బయటివారు ఏదో మోటుపనిమాత్రమేకాని రంగుదారాల్తో కన్నులాంటివి సహజంగా కనిపించేటట్లు కుట్టేపనులు నేర్చుకోనిచ్చేవారుకాదు.

ఈ 'మోటు'పనైనా క్లిష్టమైనదే. కుట్టుపనిచేయవలసినగుడ్డను ఒకచట్రానికిబిగించి అంతకుముందే గీసివున్న డిజైన్‌లో అవసరమైనరంగులు నింపేవాళ్ళం. సాధారణంగా ఒక్కదారాన్నే పదహారుపోగులు చేయవలసివచ్చేది. ఒకడిజైన్ వేయడానికి బహులేత పచ్చనుండి మిక్కిలి ముదురుపచ్చవరకుగల పదమూడురంగులు అవసరమయ్యేవి. అంటే ప్రతి రెండుమూడుకుట్లకు దారం మార్చవలసివచ్చేదన్నమాట నేను యిక్కడ ఉన్న రెండేండ్లకాలంలో డిజైన్‌లు గీయడంకూడా కొంతవరకు నేర్చుకున్నాను

చాంగ్షాలో మళ్ళీసూది పట్టాను. ఎక్కువభాగం ఇంట్లోనే చేసేదాన్ని. తరుచుగా లేసులు, చేతికప్పులు, కాలర్లవంటి వాటిమీద డిజైన్లుకుట్టటంలాంటి చిన్నపనులు చేసేదాన్ని. ఒక్కోసారి దోమతెరతెచ్చి దాని అంచులకు ప్రత్యేకమైనడిజైన్లు కుట్టమనే వారు. పనిఉన్నప్పుడు లి-యాన్‌ను మంచంమీద కూర్చోపెట్టి నాపనికి అడ్డురాకుండా 'ది డ్రాఫ్ట్‌మన్స్ మాన్యువల్' (The Draughtman's Manual) చేతికిచ్చేదాన్ని. కొద్దిసేపట్లోనే వాడికనులు మూతపడి పుస్తకం ఒళ్ళోకిజారేది.

బీదవాళ్లం కావడంచేత ఏ బాదరబందీ, కొట్లాటలూ లేక సంతోషంగా ఉండేది మాకుటుంబం. వెన్నెల్లోనో దీపందగ్గరో కూర్చొని పద్యాలు చదువుకొని తృప్తిపడే వాడు మై-షెంగ్. "ఏమీలేనివాళ్లకు అన్నీ వెతలే" అనడమేకాని మేముమాత్రం ఎప్పుడూ ఆనందంగా ఉండేవాళ్లం

## 2

మరికొద్ది సంవత్సరాలకే కుటుంబంలో పిల్లలసంఖ్య పెరిగింది. అంటే మాజీవ నస్థాయి ఇంకా తరిగింది. పరిసవకాలంలో మంత్రసానినికూడా తెచ్చుకోలేకపోయాం. అన్నీ మై-షెంగ్‌యే చేసాడు. నా కుట్టుపనికి వచ్చే కూలి మరీ తక్కువగా వుండేది. అదీ చేతికి రాకముందే ఖర్చయిపోయేది. మా కుటుంబాన్ని ఆకలి రాక్షసిబారినుండి కాపాడిన ఒకేఒక రక్షకహస్తం నా పెంపుడుతల్లి. తరుచుగా వస్తూ ఏదో ఒకటి తెస్తూ ఉండేది. అదృష్టవశాత్తు ఈసమయంలోనే మై-షెంగ్‌ను ఒకమిత్రుడు చాంగ్‌షానుండి 60 లీల (20 మైళ్లు) దూరానవున్న లుంగ్ భవనం (Lung's Mansion) లో చదువు చెప్పడానికి సిఫారసుచేసాడు. అందుకే అందరమూ అక్కడికి వెళ్లాము.

మా కొత్త ఇల్లు బహుఅదర్శ ప్రాంతంలో పర్వతాలూ, నదులు, పండ్లతో నిండిన అడవులు, పాడేపక్షులు ఉన్నచోట ఉంది. పిల్లలు ఖుషీగా ఉండేవారు. తెల వారు రేఖలు కనబడటమే తడవుగా అడవుల్లోకి తుర్రుమనేవారు. తరువాత చిత్రవిచిత్ర మైన అడవిపూలు, పండ్లు, గులకరాళ్లు, కందిరీగలు రింగన్నపురుగులునిండినజేబులతో ఇల్లుజేరేవారు. ఇంటిపక్కనే ఉన్న కుంట వారికి మిక్కిలి ఇష్టమైనప్రదేశం. ఇక్కడ తూనీగలు గుంపులు గుంపులుగా పొదలు తుంగతుప్పలచుట్టు ఝుమ్మని ముసురుకునేవి. తూనీగల తోకలకుదారాలుకట్టి రోజంతా ఇంటిచుట్టూ ఎగరేసి వినోదించేవాళ్లు. ఒకనాటి సంఘటన నాకింకా జ్ఞాపకమే. కుండపోతగా వర్షమొచ్చి వెలిసింది.

"రండర్రా, కుంటదగ్గరికివెళ్ళి తూనీగలు పట్టుకుందాంరండి" అన్నాడు లియాన్ పిల్లలతో.

మరోపిలుపు అవసరంలేకుండానే అందరూ ఉరికారు. లియాన్ దృష్టి బహు నిశితం, మొట్టమొదట తూనీగను పట్టింది వాడే.

"అబ్బో ఇక్కడో పేద్దది ఉంది" అన్నాడు యింగ్-చీన్.

"పట్టుకో" అప్పుడే మరోతూనీగనుపట్టిన లి-యాన్ అరిచాడు. యింగ్-చీన్ జాగ్రత్తగా కుంట అంచున ఊగిసలాడుతూ నిలదొక్కుకోడానికి ప్రయత్నిస్తూ బెదురు బెదురుగా, "అహఁ... నాకందడంలేదు" అన్నాడు.

లి-యాన్ మూడోతూనీగనుపట్టేయత్నంలో మునిగి అంతగా పట్టించుకోలేదు.

"ఫరవాలేదులే- బెదరకు. ఊఁ . పట్టు...." అన్నాడు.

కొద్దిసేపు మౌనం తరువాత నీటిలో ఏదోపెద్ద చప్పుడైంది.

"అయ్యో, అయ్యో... యింగ్-చీన్ నీళ్లలో పడ్డాడు" అంటు పెన్-వెన్ మొత్తుకున్నది.

చేస్తున్నపని అక్కడేవదలి అటు ఉరికాను. నేనక్కడికి చేరేసరికి నా భర్తతో సహా ఎంతో మంది గుమిగూడారు.

"భయమేంలేదు. సురక్షితంగానే బయటికిలాగాం" అంటూ మై-షెంగ్ నాకు ధైర్యం చెప్పాడు.

యింగ్-చీన్ నీళ్లలో మునిగిన ఎలుకమాదిరిగా నిలబడ్డాడు. నీటిలో ఒక బూట్ పడిపోయింది. నన్నుచూడగానే ఏడుపులంకించుకున్నాడు.

"పైగా ఏడుస్తున్నావ్? వెధవ. మునిగి చచ్చివుంటేనే బాగుండేది అనిపించేట్లు తంతాను" అన్నాను.

"కొట్టకమ్మా, కొట్టకు. తప్పంతా నాదే, నేనే చెయ్యమన్నానాపనివాణ్ణి" అని వేడుకున్నాడు లి-యాన్.

"అయితే నీకూమాత్రం తప్పుతాయా, నీకుతగుల్తాయి" అంటూ వాడికీ రెండు అంటించాను. కోపంతో వాళ్లు పోగుచేసిన చెత్త అంతా అక్కడ పారబోసి అందరినీ ఇంటికి ఈడ్చుకుపోయాను. మై-షెంగ్ గడపలో నిలబడి అన్నీ గమనిస్తూనేఉన్నాడు.

"బాగుంది. వాడెవడో మూర్ఖపు మెజిస్ట్రేట్ తీర్పులావుంది. తప్పో ఒప్పో ఒక్కొక్కడికి మూడువందలు అంటించమన్నాడట" అన్నాడు.

ఆ మాటల్లోని సత్యం గ్రహించడానికి పెద్దమేధస్సవసరంలేదు. నేను క్రూరంగా ప్రవర్తించానని గ్రహించాను. కొన్ని క్షణాల తరువాత మై-షెంగ్ పిలిచాడు.

"నువ్వు యింకా మండిపడుతూనే ఉన్నావుగాని, పిల్లడు జరిగిందంతా మరచి

పోయాడుచూడు,"అంటూ కుంటవైపు చూపించాడు. యింగ్-చీన్ బాతునువెంటాడుతూ కనిపించాడు.

"నీపద్ధతులు ఫలించలేదు. అవునా? వాడలాంటిపనులెందుకు చేయకూడదో వివరంగా చెప్పరాదూ...."

హుం.... నాకు వీటన్నింటికీ ఒపికలేదు"

"ఎట్లా. తెచ్చుకోవాలిమరి. లేకపోతే అడుగడుగునా అపజయంతప్పదు."

ఆయన చెప్పేదంతా ఒప్పేనని నా అంతరంగానికి తెలుసు. అయినా నేను మొండిగా మౌనంగానేఉన్నాను. ఇదిజరిగిన కొద్దిరోజులకే లి-యాన్ బడికిపోసాగాడు.

పల్లెపట్టున కావలసినంత వంటచెరకు. నీరు ఉచితంగా దొరకడంవలన చాలా పొదుపుగా బ్రతకడానికి వీలుండేది. దీనికితోడు మాకు అవసరమైనంతకంటె ఎక్కువ కూరగాయలు పండించ వీలుగల తోట గూడాఉంది. మా జీవితం ఎంతో మెరుగుపడ్డా మై-షెంగ్‌కు తృప్తికలుగలేదు.

మనిషి కేవలం ప్రస్తుతాన్ని గురించీ తన స్వవిషయాల గురించీ ఆలోచించ గూడదు; తనకూ తన కుటుంబవ్యవహారాలకే పరిమితం చేసుకోగూడదు. ప్రతి మనిషికీ కొన్ని సాంఘిక బాధ్యతలున్నాయి"అంటూండేవాడు మై-షెంగ్.

నాలోనేను"ఏమిటబ్బా. ఇతడు దేన్నిగురించి ఆలోచిస్తున్నాడో?"అనుకునేదాన్ని.

1923 లో మై-షెంగ్ తన కొందరి మిత్రులతోకలసి షేచువాన్‌లో పాఠశాల నడుపుదామనే ఉద్దేశంతో వెళ్లాడు.

"నేను లోకంచూడాలి; జీవితసత్యాన్ని అన్వేషించాలి" అన్నాడు నాతో.

మై-షెంగ్‌చేసే ప్రతిపనిపట్ల నాకెనలేనివిశ్వాసం. అందుకే ఎందుకు? ఏమిటి అనే వాదంలేకుండా పిల్లలను వెంటబెట్టుకొని చాంగ్‌షాకు తిరిగివచ్చాను.

దాదాపు మూడు సంవత్సరాలతరువాత అక్కడి యుద్ధపతులు పాఠశాలమూయించడంచేత మై-షెంగ్ చాంగ్‌షాకు తిరిగి వచ్చాడు. దారిలో దొంగలు దోచుకున్నారట. చింపులే మిగిలాయి వంటిమీద. ఒక బూటుకూడాపోయింది. తన సహజమైన నిర్లిప్త ధోరణిలో, "ఈసారి నిజంగానే నేనన్నీ పోగొట్టుకున్నాను" అన్నాడు. చీపురు మాదిరిగా పెరిగిన గడ్డం మీసాలు కుచ్చుకుంటుంటే గోలపెడుతున్నారుపిల్లలు తండ్రి వంగిముద్దాడుతుంటె. ఎంత ఘోరంగా తయారయ్యాడు. ఆ చినిగి దుమ్ముకొట్టుకున్న బట్టలు, కమిలి తీవ్రంగాఉన్న ముఖం. అబ్బ! చివరికి గొంతుకూడా మారింది.

"మై-షెంగ్, ఎంతగా మారిపోయావు!"

"నిజమా? ఏదీ, నీవెంతమారావో చూస్తాను....అబ్బో, నీవుమాత్రం ఎప్పటిలాగానే వికృతంగా ఉన్నావు!"

"అహాఁ .. అయితే నీమనసూ మారిందన్నమాట."

అకస్మాత్తుగా మై-షెంగ్ ధోరణి గంభీరమైంది. "నిజమే, నాలో మార్పు వచ్చింది. నా జీవితం విప్లవానికంకితంచేశాను. చూస్తావుగా, ఈ యుద్ధపతులపీడా విరగడయ్యేరోజు ఎంతోదూరంలేదు" అన్నాడు.

ఆ మాటల అంతరార్థం నాకు చప్పున బోధపడలేదు. ఏదో పెద్దమార్పువస్తూందనీ, పీడకులను పతనం చెందించి, పీడితులు నిలదొక్కుకుంటారని ఒక అస్పష్టభావంమాత్రం నా మనసులోఉండేది. ఎలాగైతేనేం ఈ మార్పు మొదట మై-షెంగ్‌లో గమనించాను ఉదయాన్నే వెళ్లి రాత్రి ఎప్పుడో బాగా పొద్దుపోయాకగాని వచ్చేవాడు కాదు. ఇంతకుపూర్వం మాదిరిగా తీరికగా భోంచేయడం పోయింది. ఎంతో ముఖ్యమైనపని ఉన్నవాడిలా యెప్పుడూ ఏదోపనిలో వ్యస్తుడై వేగిరపడుతూండేవాడు. ఈ మార్పులన్నీ నేను వద్దనుకున్నా కనిపించేవే, గమనించానుకూడా. అయితే ఆయన కమ్యూనిస్టుపార్టీ సభ్యుడయ్యాడన్న విషయం నా కణుమాత్రమూ తెలియని గొప్ప మార్పు.

ఒకనాడు కూరగాయలమార్కెట్‌కని బయల్దేరాను, దారి అంతా శ్రామికులు, కర్షకులు, విద్యార్థులు మొదలైన ప్రదర్శకులచేతనిండి రాకపోకలకంతరాయంగా ఉంది. అట్టలు పచ్చవి, ఎర్రవి- కొన్నిటిరంగైనా ఆరలేదింకా- పట్టుకొని నినాదాలుచేస్తున్నారు. ఓ దుకాణం ఎదుట ఎవరో విద్యార్థిలాఉన్నాడు, ఉపన్యాసం యిస్తుంటే పెద్దగుంపు గుమిగూడింది. లోపలికి తోసుకునివెళ్లి ఏమిటిదంతా అని శ్రోతల్లోఒకరిని అడిగాను.

"తెలియనట్లే అడుగుతున్నావే, విప్లవసైన్యం నగరంలోకి ప్రవేశించింది."

నా అజ్ఞానానికి ఎంతో ఆశ్చర్యపడ్డట్లుగా కన్పించాడతడు. ప్రతివాడూ తప్పుకొని ప్రదర్శకులు ముందుకు సాగడానికి చోటిస్తున్నారు. నన్ను గుంపులోకినెట్టారు. ఎలాగో తంటాలుపడి నిక్కి నిక్కి ఒక క్షణమాత్రము ఆ దృశ్యం చూశాను. పారిపోయిన భూస్వాములను పట్టుకున్నారు, రైతులగుంపొకటి బల్లెములుధరించి కాపలాదార్లుగా పోతున్నారు

ఎట్లాగో ఆ గుంపునుండి బయటపడిచూసుకుందునుగదా, నాపేముబుట్ట పూర్తిగా నజ్జునజ్జయింది. అంతేకాదు పూర్తిగా అపరిచితమైనబజారుకొచ్చాను. అప్పటికే మధ్యా

హ్నంకావచ్చింది. మార్కెట్ మూసిఉంటుంది. ఇక వెళ్ళినా లాభంలేదని యింటిముఖం పట్టాను. ఇల్లు సమీపించేసరికి పిల్లల ఉద్రిక్తమైన అరుపులు వినిపించాయి.

ఆ రోజంతా మనసులోమనసులేదు. అన్నం మెత్తబడింది. సూప్‌లో ఉప్పు వేయడంమరచాను. ఇంకా ఆ నినాదాలు నాచెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. ఆ జండాలు రెపరెపలాడుతున్న దృశ్యమంతా ఇంకా కండ్లముందే మెదలసాగింది.

పూర్తిగా సాయంత్రమైంది. అన్నంచల్లబడింది. అయినా మై-షెంగ్, లియాన్‌లు ఇల్లుచేరలేదు. మిగతాపిల్లలను నిద్రపుచ్చి గడపమీద వాళ్లకొరకెదురు చూస్తూకూర్చున్నాను. అకస్మాత్తుగా లియాన్ సుడిగాలిలాదూసుకొని ఇంట్లోకొచ్చాడు.

"అమ్మా, ఆకలిమాడిపోతుందే. అన్నంపెట్టు" అన్నాడు. గొంతెండి గరగరమంటూంది.

"కడుపులోమాడకపోతే అసలు ఇంటికొచ్చేవాడివేకాదుగదూ!" అని తిట్టాను.

"కోపమొచ్చిందా అమ్మా?"— నాకుతెలుసువాడిటక్కులు. ప్రతిమాటేటప్పుడు ఒకటేమాటలు, సోది.

"నేనేం ఆడుకోటంలేదమ్మా. ఒక పెద్దమీటింగ్‌కెళ్లాను. ఇంకా .." గడగడ మాట్లాడుతూనే ఉన్నాడు.

"చాల్లే. తిండితిను."

నీవుకోప్పడితే ఒక్క మెతుకూ కూడాముట్టను. అబ్బ మీటింగ్‌దగ్గర ఎంత పెద్ద గుంపని. నా గొంతు బొంగురుపోయిందికదూ. ఉపన్యాసమిచ్చాను."

"ఏమిమీటింగ్‌రా?" అన్నాను కటువుగా.

"ఉత్తరయాత్రా సైన్యానికి[2] స్వాగతం చెప్పడం, అదే యుద్ధపద్ధతులతో పోరాడే విప్లవసైన్యం. నాన్న అన్నట్లు ఉత్తరయాత్రాసైన్యం కాలిడిన ప్రతిచోటా పీడన అంతమొందుతుంది. పేదలకు తినడానికి తిండిదొరుకుతుంది .." లి-యాన్‌గొంతు పెద్దవాళ్ల గొంతుమాదిరిగా మారింది.

"ఆహాఁ... ఇందుకా! అయితే విప్లవం ఎంత తొందరగావచ్చింది!"అని నాలోనే అనుకున్నాను. మై-షెంగ్‌వస్తే ప్రశ్నలవర్షం కురిపించుదామనుకున్నాను. కానిఆయన రాలేదారాత్రి.

మై-షెంగ్‌నాకు ఎన్నోసార్లు విప్లవం అంటే ఏమిటి? ఎందుకు, ఎవరికి వ్యతిరేకంగా అనే విషయాలనుగూర్చి చెప్పాడు. అయినా నాకు దాని అంతు చిక్కలేదు.

---

[2] Northern Expeditionery Army

వ్యక్తిగా నేను మార్పులగురించి పట్టించుకోకున్నా అవిమాత్రం స్పష్టంగా కొట్టవచ్చినట్లు కానవచ్చేవి. ధాన్యంధర పూర్తిగాతగ్గింది. తెల్లవారేసరికి వ్యాపారస్తులు వినయమూర్తులయ్యారు, ఇంటి అద్దె ఇవ్వడానికివెళ్తే "ఇప్పుడివ్వలేకపోతే తర్వాత యివ్వచ్చులే తొందరేంలేదు. ఇకనుండి మనమంతా సమానులం"అనేవాడు ఇంటియజమాని. అయితే విప్లవం సాధించిందింతేనా అనుకున్నాను.

విప్లవసైన్యం నగరం ప్రవేశించినప్పటినుండీ మై-షెంగ్ కనిపించడం తగ్గింది. హూనాన్‌రాష్ట్ర కార్మికసంఘ[3] కార్యక్రమాల్లో పాల్గొనేవాడు. యుద్ధభూమికి ఆయుధాలు మందుగుండు చేరవేయడానికి అక్కడక్కడ గాయపడ్డవారిని మోయడానికి కార్మికులను సిద్ధం చేస్తున్నాడు. తనఖీదళాలకు (Inspection Guards) సాయంత్రం తరగతులు నిర్వహించేవాడు. ఎప్పుడైనా ఇంటికివస్తే తొందరలో ఉండేవాడు. కండ్లు ఎర్రగా రక్తంచిమ్ముతూ ఉండేవి. జట్టు చెదిరిఉండేది. నాకాయన ఆరోగ్యంచూసి కలవరం కలిగేది.

"నువ్వు విశ్రాంతి తీసుకోవాలి"

"ఎందుకు. ఏమి అలసిపోలేదే, ఎంతో ఉత్సాహంగాకూడా ఉన్నాను. ఇలాగే వరుసగా మూడురాత్రులు మూడుపగళ్లు పనిచేసినా నాకేమీకాదు"

"ఆ బట్టలు విడువరాదూ ఉతుకుతాను." బట్టలనుండి వస్తున్న మురికి వాసనకు ముక్కువిరుస్తూ అన్నాను.

"ఉహూఁ సమయంలేదు, పొద్దున్నే ఒక మీటింగ్‌కెళ్లాలి, రేపుచూద్దాంలే."

రెండవరోజున ఆయన రాలేదు. ఇప్పుడు ప్రదర్శనలు, పరేడ్‌లు, సమావేశాలు దాదాపు నిత్యమూవిద్యాసంఘమైదానం (Educational Association Square) లో జరుగుతూనేఉన్నాయి. కార్మికద్రోహులు, స్థానిక నిరంకుశులు, ధూర్తభూస్వాములపై విచారణజరుపుతున్నారు. కార్మికసంఘ నాయకులు చర్చలు జరుపడానికి పార్టీ కార్యక్రమాలను తెలియజేయడానికికూడా ఆస్థలాన్నే వాడుకుంటున్నారు ఎండావాననక సమావేశాలకు ప్రజలు గుంపులు గుంపులుగా వచ్చేవారు.

ఆరోజుల్లో సియాంగ్‌నదిపై బ్రిటిషు మరియు జపాను సామ్రాజ్యవాదుల గన్‌బోట్లూ, వ్యాపారనౌకలూ తిరుగుతున్నాయి. ఒక్క చాంగ్‌షాలోనే బ్రిటిష్‌బటర్‌ఫీల్డు, స్వైర్ మరియు జపాన్ నిషిన్‌కైషా స్టీంషిప్ కంపెనీలు కార్మికులను దోచుకునేవి.

[3] General Labour Party of the Hunan Province.

విప్లవసైన్యం వచ్చినతరువాతకూడా చాంగ్‌షాలోని బ్రిటిషువాళ్లు జపాన్‌వాళ్లు యెప్పటి మొండివైఖరినే ప్రదర్శించారు. దానితో కార్మికులు వాళ్ళను మరీ ద్వేషించసాగారు. సామ్రాజ్యవాదుల సరకును ఓడలకెత్తడంగాని దించడంగాని చేయవద్దని కార్మికసంఘం కార్మికులనాదేశించింది. సరుకులమ్మేవాళ్ళనుకూడా సామ్రాజ్యవాదులకు ధాన్యం కూరగాయలు అమ్మకుండా ఏర్పాటుచేశారు. కొద్దిరోజుల్లోనే యీ ఓడలు ఆహారపదార్థాలు అయిపోవడంతో రేవువదలి తోకముడుచుకొని వెళ్ళిపోయాయి. సామ్రాజ్యవాదులు ఓడిపోయారు.

కొన్నిరోజులతరువాత మేము ఆటోమొబైల్ కార్మికసంఘం ప్రక్కనున్న భవనంలోకిమారాం. ఇది ఒక యుద్ధపతిది. ఇప్పుడు సత్రంగామార్చబడింది. అలాంటి దివ్యభవనంలో నేనిదివరకెప్పుడూ కాలిడలేదు. మై-పెంగ్‌తోకూడా అన్నానది ఎంతో అద్భుతంగాఉందని.

"నిజమే. అందులో ప్రతిరాయినీ శ్రమజీవులే పేర్చారు. శ్రమజీవులు కేవలం శ్రమజీవులుమాత్రమే. సర్వశక్తిసంపన్నులు. సామ్రాజ్యవాదులను బయటికిపొమ్మంటే పోవలసిందే. యుద్ధపతుల పరిపాలనను వారు రద్దుపరచదలచుకుంటే రద్దయినట్లే లెక్క. విప్లవం పరిపూర్తిఅయ్యేవరకూ వేచిచూడు. మేము నిర్మించే యిండ్లనుచూచి యిది తలపంచుకోవాలి.

## 3

నాకు అన్నిటికంటె పెద్దబెడద లి-యాన్. వాడిప్పుడు గస్తీతిరిగే బాలలదళం నాయకుడు. ఇతరపిల్లలతో ఎప్పుడూ జగడం కొనితెచ్చుకునేవాడు.

"ఏమమ్మా, మీపిల్లవాణ్ని అదుపులో పెట్టుకుంటావాలేదా? మళ్ళిపోట్లాడుతూనే ఉన్నాడు"అంటూ నిత్యమూ ఇరుగుపొరుగువారు ఫిర్యాదుచేసేవారు.

ఒకరికి నచ్చజెప్పపంపేలోగా మరొకరు సిద్ధం. ఏదో కథఅల్లి యింటిమీదికెగబడేవారు. వారిఫిర్యాదులకు బలంచేకూర్చడానికి, నిజమనినమ్మడానికి పిల్లవాడిఏడుపులు మొత్తుకోలు తోడు.

ఇక లాభంలేదు వాణ్ని "అదుపు"లోపెట్టడానికి ఏదో ఒకటి చేయాలి అని నిశ్చయించుకున్నాను. రాత్రి యింటికిరాగానే కొంచెం కటువుగానే మాట్లాడాను.

"లి-యాన్, రేపు నువ్వు ఇంట్లోనుండి కదలవద్దు."

"ఎందుకు?" అన్నాడాశ్చర్యంగా.

"నీకుతెలియదు? ఈవీధిలో గొడవలన్నింటికీ నీవేకారణం."

ఒకక్షణమాలోచించి నిశ్చలంగా జవాబు చెప్పాడు.

"నేనుపోకతప్పదు."

"నీతల్లితో మాట్లాడేతీరదేనా? ఫో- వెంటనేవెళ్ళి మీనాన్నను తీసుకురాపో. నీవు పోకపోతే నేనేపోతాను."

కొంచెం వెనుకాడాడు. మై-షెంగ్‌వస్తే తన పరిస్థితి బాగుండదని స్పష్టంగా తెలుసు. అయినాగాని స్వాభిమానముకలవాడుగనుక తను మంచిఅని నమ్మినదాన్ని ఆచరించడానికి వెనుకాడేవాడుకాదు. మై-షెంగ్ సరిగ్గా అప్పుడేవచ్చాడు. ఏదో జరిగినట్లు పసిగట్టాడు.

"ఏంజరిగింది?"

"నీ కొడుకునే అడుగు. అల్లరిమూకలతో ఊరంతా బలాదూరుతిరిగి కొట్లాటలు తెస్తున్నాడు. చదువంటే ఏమాత్రం శ్రద్ధలేదు...." కోపమంతా వెళ్లగక్కాను. జరిగిందంతా పూసగుచ్చినట్లుచెప్పా. ఎప్పుడూ ప్రశాంతంగాఉండే మై-షెంగ్ మండిపడ్డాడు.

"ఇంతెత్తుఎదిగావు. బుద్ధిలేదూ? మీ అమ్మనెందుకు ఇబ్బందిపెడ్తావురా?"

"నేను.. నేనేమీచేయ.... లేదు" గద్గదంగా నీళ్లనిండిన కండ్లతో అన్నాడు.

"ఇంకా చేసినతప్పు ఒప్పుకోవేం? నువ్వేమీచెయ్యందే చేశావని ఇరుగుపొరుగువాళ్లెందుకంటారు. జాగ్రత్త! బుద్ధిగా బడికివెళ్ళి యికముందైనా ప్రతి సబ్జక్టులో 80 మార్కులకుపైగా తెచ్చుకున్నావసరి. లేకపోతే ఈ యింటికివచ్చేపనిలేదు."

మై-షెంగ్‌కు ఇంతకోపంరావడంచూచి, ఇదివరకే విప్లవకార్యక్రమాల్లోమునిగి ఉన్న అతణ్ణి ఇలాంటి చిన్నచిన్నవిషయాల్తో కలతపరచడం తప్పని పశ్చాత్తాపపడ్డాను. ఆ జరిగిందంతా మరచినట్లు నటించాను.

"ఆలస్యమౌతుంది. అన్నంతిందామా ఇక" అన్నాను.

ఆ సాయంత్రమంతా విచారమావరించింది. లి-యాన్ అలిగి తిననని రాతిమీద తన చాకుగీరుతూ ఒకమూలకు కూర్చున్నాడు. మై-షెంగ్ పట్టించుకోలేదువాణ్ని. "నీ అవిధేయతకు దేశిక్ష. అనుభవించాల్సిందే, నీవంటివాడుంటే ఎంత లేకుంటే ఎంత?" అన్నట్లుగా.

ఇక వేసవిసెలవులు మొదలౌతాయనగా ఒకరోజు పొద్దున్నే లి-యాన్, ఇంగ్-చీన్‌లు పాఠశాలముగింపు ఉత్సవాల్లో పాల్గొనడానికి బడికివెళ్లారు. అంతా అయినతరువాత యింగ్-చీన్, అన్న ఎక్కడా కనబడక, ఒంటరిగా తిరిగివచ్చాడింటికి.

"హుం, మళ్ళీ తిరుగుడు మొదలుపెట్టాడన్నమాట" అనుకుంటూ అంతగా పట్టించుకోలేదునేను. మధ్యాహ్నానికికూడా వాడిజాడలేదు.

"అన్నయ్య ఎందుకురాలేదింకా?" అన్నాడు యింగ్-చీన్.

"నువ్వేందిగులుపడకు. అయినా వాడెక్కడికెళ్లాడో నీకెందుకు?" అని అన్నా "ఈసారి ఎటోదూరమేవెళ్లాడు" అని లోపల అనుకున్నాను,

యింగ్-చీన్‌కు అన్నంటే ఎంతోప్రేమ. అన్నలేకపోతే దేనియందూ మనసుపడేవాడుకాదు, అన్నమైనాసరే. గబగబ రెండు బుక్కలు మింగి అన్నను వెదకడానికి బయల్దేరాడు.

చీకటిపడింది. అయినా లి-యాన్‌రాలేదు. యింగ్-చీన్‌ను అడిగినా లాభంలేకపోయింది.

"ఈ మధ్యాహ్నం అన్నిచోట్లా వెదికాను. కాని ఎక్కడా కనిపించలేదు." అన్నాడు.

"ఈపిల్లడికేమైయుండవచ్చు?" అని నాలోనే అనుకొని, "యింగ్-చీన్, పద, వెళ్లి బళ్లోచూసొద్దాం" అన్నాను.

యింగ్-చీన్ అలసి నిద్రతో కళ్లు మూతలుపడుతున్నా ఈ మాటవినగానే దిగ్గున లేచాడు.

మేము బడికివెళ్లి చాలసేపు తలుపుతట్టాం. కాని ఎవరూరాలేదు. వాడక్కడ ఉండడనిపించింది. అక్కడినుండి సరాసరి మై-షెంగ్‌కొరకు కార్మిక సంఘానికివెళ్లితే మై-షెంగ్ అప్పటికే ఎటోవెళ్లాడు. బజార్లన్నీ గమ్యంలేకుండా తిరిగాం. బాగా ఉక్కగా ఉండడంవల్ల ప్రజలు కొందరు పేవ్‌మెంట్లమీద పేముకుర్చీలు వేసుకొని కూర్చున్నారు; మరికొందరు వెదురుమంచాలమీద నడుం వాల్చారు. ఇదివరకే కోపంగా ఉండడంవల్ల కొంత, వేడిమికి కొంత చెమటలుకారుతున్నాయి.

"అమ్మా, ఇంటికిపోదామే, లి-యాన్ వచ్చాడేమో" అన్నాడు యింగ్-చీన్.

ఏంచేయాలో తోచలేదు. అప్పటికే బాగా పొద్దుపోయింది. వర్షం వచ్చేట్టనిపించింది, ఆకాశమంతా నల్లటిమబ్బులు కమ్మాయి, గాలికూడా బాగా తడిగానూ వేడిగానూ ఉంది. ఇంటికే పోదామనే నిశ్చయించుకున్నాను; తీరావచ్చేసరికి లి-యాన్‌లేడు.

మరుసటి ఉదయం యింగ్-చీన్‌ను వెంటబెట్టుకొని మై-షెంగ్ బయల్దేరాడు లి-యాన్ మిత్రులెవరినైనా అడుగుదామని. లి-యాన్‌తో బడిలో చదువుకునే పిల్లవాడే కొంత సమాచారమందజేశాడు. చెంగ్‌టా-నియెన్ అని ఒక ఆప్తుడైన మిత్రు

డున్నాడట. అతడు తన ఊరు, సియాంగ్టన్ వెళ్లాడట. లి-యాన్ సియాంగ్టన్‌కు వెళ్లి ఉంటాడా అనిపించింది. మై-షెంగ్ పైకినిబ్బరంగా ఉండడానికి ప్రయత్నించాడే తప్ప అతనికీ ఆందోళనగానే ఉన్నట్లు గమనించాను.

"సియాంగ్టన్‌కువెళ్లి అక్కడఉన్నాడేమో చూసివస్తే పోయేదేముంది?" అన్నాడు.

నాకు స్టీమర్ ప్రయాణానికొక టికెట్ తెచ్చిచ్చాడు. ఆరోజే చేరా సియాంగ్టన్ పోగానే వాడిగురించి ఆచూకీ తెలిసింది. చెంగ్‌టా-నియెన్ తల్లితో వాడిగురించి ప్రస్తావించగానే "ఓహో, లి-యానా? అవునువచ్చాడే. ఏదో ఫ్యాక్టరీలో తాత్కాలిక కార్మికునిగా ఉద్యోగంకూడా దొరికింది" అన్నది.

దిగ్భ్రిమచెందాను. "ఏమిటీ? వాడా? పనా? ఈ వయసులో ఏంచేయగలడు వాడు?" అన్నాను.

"వందలీలదూరము ($33\frac{1}{2}$ మైళ్లు) చేతిలో చిల్లిగవ్వలేకుండా ప్రయాణం చేయగలిగాడంటే ఎంతో సమర్థుడైన బాలుడే అనుకోవాలి" అంది చెంగ్‌తల్లి.

వాణ్ణిచూడాలని ఎంతో ఆదుర్దాగాఉంది. చెంగ్‌తల్లికి ధన్యవాదాలు తెలిపివెంటనే ఫ్యాక్టరీకి బయల్దేరాను. దారిపోడుగునా ఒకటే ఆలోచన: "జీవితాంతం మరపురాని విధంగాతంతాను".

నారాకపూర్తిగా పూర్వసూచనలేనిదీ ఊహించనిదీ కావడంతోవాడు పూర్తిగా నిశ్చేష్టుడయ్యాడు. నోట మాట పెకలలేదు.

"అమ్మా, నీకు....నీకు ఎట్లాతెలిసింది, నేనిక్కడున్నానని?"

"ఎందుకుతెలియదురా!" తీవ్రంగా మందలిద్దామని సిద్ధపడ్డాను. కాని వాడు తల వాల్చడంతో వానిముఖాన్ని ఆవరించిన విచారానికి నామనసు కరిగింది.

"హుఁ.... ఇంట్లో అందరూ చాల బెంబేలుపడ్డారు. నీకొరకు అన్నిచోట్లా అన్నంకూడా మానుకొని వెతికాం. మీనాన్న రెండురోజులు పనికూడా మానుకోవలసి వచ్చింది. నిన్ను వెదకడానికి"అంటూ నిట్టూర్చాను.

"నేను ఇంటికివచ్చి నాన్నకు ముఖం చూపించలేను. నా గింజలు నేనే సంపాదించుకుంటాను" అన్నాడు.

"ఏంచెత్తవాగుడురా అది?"

"నేను లెక్కల్లో పాస్‌కాలేదు."

"అయితే ఇంటికివచ్చి తప్పయిందని ఒప్పుకో;"

ఒక క్షణం మౌనంగా వుండి "అయినా నేనెవరితోనూ జగడమాడలేదు. అన్నాడు కోపంగా.

ఇరుగుపొరుగువాళ్లు నిరంతరం ఫిర్యాదులుచేయడం వాని మనసు చెడగొట్టింది. బాలలదళం 'గస్తీ' తిరిగేటప్పుడు ఇతరపిల్లలు వాళ్లమీద రాళ్లువేసేవారనీ అందుకే జగడాలువచ్చేవనీ నాకు వివరించసాగాడు. అయినా తాను స్వయంగా ఎప్పుడూ కొట్లాటల్లో పాల్గొనలేదట.

వాడి అభిప్రాయం అర్థంచేసుకోవడానికి ప్రయత్నించనందుకు చింతించాను.

"దీనికి మీనాన్నను నిందించవద్దు. తప్పంతా నాదే. నాకు పూర్తికథంతా తెలియక నిన్ను నిందించాను"అన్నాను.

వాడిముఖం వికసించింది. మెడను చుట్టుకుని కౌగలించుకున్నాడు.

"ప్రపంచంలోకంతా నీవే మంచి అమ్మవు."

ఈ అంతులేని వాగుడు ఇలుచేరేవరకూ కొనసాగుతూనేఉంది.

"నాన్న నామీద కోప్పడతాడా?"

"తప్పక. ఇకముందైనా ఇలాంటి పారిపోవడాలు ఉండకుండేతప్ప."

"హుఁ.... అయితే ఆ కుళ్లలెక్కలగురించి గట్టిగా కష్టపడాలన్నమాట"అన్నాడు గాఢంగా ఆలోచిస్తూ.

ఆ "కుళ్లలెక్కల"పేరు వినగానే మరీ నిస్పృహచెందాడు.

"ఇంతదూరమూ నడిచేవచ్చావా!"అన్నాను మాటమార్చుదామనేఉద్దేశంతో.

"ఊఁ.... మొదటిరాత్రి రైలుపట్టాలదగ్గర పడుకున్నాను. మంచుకురిసి బట్టలు పూర్తిగా తడిసిపోయాయి."

"భయంకాలేదా."

"ఆ... అయింది, మొదట. తరువాత నిద్రపట్టింది. అప్పుడిక దేన్నిచూసీ భయపడే అవసరమేలేకపోయింది" అన్నాడు పళ్ళికిలిస్తూ.

"ఏమైనా తిన్నావా?"

"అఁ... అహఁ " "సిగ్గుపడుతూ ఒప్పుకున్నాడు." నువ్వాఉదయమిచ్చినకేక్ ముక్క తినకుండా సియాంగ్టన్ చేరేవరకు అలాగేఉంచుకున్నాను. వెంటనే ఉద్యోగం దొరక్క మాడవలసివస్తుందని భయం."

వాడి గంభీరతకు నవ్వు వచ్చింది. "అబ్బో! ఒక్క కేక్‌ముక్క యెంతకాలమొస్తుందనుకున్నాడువీడు "అనుకున్నాను. అయినా యిది వాడిలో నేనిదివరకెన్నడూ గమనించని దూరదృష్టిని సూచించింది.

వాడిరాక ఇంట్లో మిగతా పిల్లలందరికీ అంతులేని ఆనందాన్ని కలిగించింది. కలిసిన ప్రతివారూ వాడిని 'ఎక్కడికెళ్లావు, ఏమిచేస్తున్నావు' అని అడుగుతున్నట్లే అనిపించింది. తత్తరపాటుతో ఇకిలించటం తప్ప ఏమీ చెప్పలేకపోయేవాడు. అనుకున్నట్లే తండ్రి గట్టిగానే మందలించాడు. మై-షెంగ్ మేమువచ్చిన సాయంత్రం ఇంట్లోనేఉండే ఏర్పాటుచేసుకున్నాడు లి-యాన్‌ను దగ్గరికిపిలిచాడు. ఆయనవైఖరిచూసేసరికి తానెంత ఘోరమైన తప్పుచేశాడో అర్థమైంది లి-యాన్‌కు.

"ఫెయిలైతే యింటినుండి పారిపోవడమే సులభమార్గమనుకున్నావుకదూ. గుండె లేదురానీకు. కార్మికుడివికావచ్చు ఇవాళ. దీంట్లోనూ తగినస్థాయికి రాకపోతే యేంచేస్తావు? అప్పుడెక్కడికి పారిపోతావు?"

"ఇక పారిపోను."

"పారిపోతావురా, తప్పకపారిపోతావు. నీవంటి గుండెలేనివాళ్లకిష్టమైనపనేఅది. చేపట్టినకార్యం సాధించలేకపోయేసరికి ఇటునుండి అటు, అటు నుండి యిటు పరుగులు పెడ్తారు. అదే సులువైనమార్గం" మైషెంగ్ నిర్దాక్షిణ్యంగా నొక్కి నొక్కి మాట్లాడుతున్నాడు. "ఆఁ...లెక్కలతో నాకేమిటి, లెక్కలురాకపోతే బ్రతకలేనా అనుకుంటుండవచ్చు. నిజంగా నువ్వట్లా అనుకుంటుంటే నీవు నేర్చుకోవలసిందేమీలేదు ఉద్యోగం దొరుకుతున్నప్పుడు చదువుంటేనేం లేకపోతేనేం' అంతేకదూ. మరి అందులోనూ అపజయంకలుగుతే...?"

"నాన్నా... నేను..."

లి-యాన్ మాటలను వినకుండా మై-షెంగ్ మాట్లాడుతూనే ఉన్నాడు. "అది కాకుంటే ఇంకొకటిచూసుకుంటావు. అందులోనూ సరిగా పనిచేయలేకపోతేమరొకటి. ఎంత అజ్ఞానివైతే పనులంతసులభం. అంతేనా? చివరకెందులోనూ చెల్లక బడాయిలు కొడుతూ తిరుగుతావు. మనిషిగా బ్రతకటమంటే అంత సులభమనుకున్నావా? నువ్వనుకునేదంతా తప్పురాపిచ్చివాడా! ఈలోకంలో సులువైనదేదీలేదు. అట్లా అనుకున్నంత ఘోరమైన తప్పు మరోటిలేదు. అసలు కష్టపడకుండా సాధించగల వస్తువేదైనాఉందా? చెప్పు."

మై-షెంగ్ విద్యార్థికాలపు తన అనుభవాలను గురించి చెపుతున్నాడు, రాతలో ఒక క్రమంరావడానికి మణికట్టుపైన ఒక నీళ్ళకప్పు బ్యాలన్సుచేసేవాడట. కుంచెగీతల (Brush strokes కు బలము చేకూరాలని కుంచెకు ఒక చివర రాగిపైసలు కట్టేవాడట. పుస్తకాలు కొనడానికి డబ్బు ఆదాచేయడానికని బజార్లలోనడిచేటప్పుడు బూట్లు తొడుక్కో

కుండా మోసుకెళ్లేవాడట. తరువాత షేచువాన్ రాష్ట్రంలో తను పాల్గొన్న విప్లవకార్య క్రమాన్నిగురించి వివరించాడు. తానేదో పాలుపోక పని తప్పించుకోవడానికికాక ఒక సత్యాన్ని అన్వేషిస్తూ అక్కడికి వెళ్లానన్నాడు పెద్ద మేధావీ, విద్యావంతుడూ కాక పోవడంచేత సంఘానికి తాను చేయగలిగిందీ. ఇవ్వగలిగిందీ తక్కువట. ఇట్లాచెప్తూండే సరికి మై-షెంగ్ స్వరంలోని కటుత్వం తగ్గింది. పిల్లలు కొంచెం నిర్భయంగా ఊపిరి పీల్చుకున్నారు. తిట్లు నిష్ఫలమేమీకాలేదు. రాత్రి పడుకునేముందు లి-యాన్నాచెవిలో అన్నాడు. "నాన్నచెప్పేదిరైటే. నాన్న ఎంతో మంచివాడు. ఇక యెటూ పారిపోను. బుద్ధిగాఉండి నాన్నఅంతవాణ్ణి కావడానికి ప్రయత్నిస్తానని వ్వాగ్దానము చేస్తున్నాను".

లి-యాన్ అన్నమాట నిలబెట్టుకున్నాడు. వేసవిలో వేకువనేలేచి పిల్లలను మేల్కొల్పేవాడు. తరువాత యింట్లోని చిన్నచిన్న పనులెన్నో చేసేవాడు, గదులన్నీ ఊడవటమేకాక ఉదయఫలహారానికి గంజివార్చేవాళ్లు. తరువాత ఎంతో శ్రద్ధగా పాఠాలు చదువుకునేవారు. చిన్నవాళ్లు ఇంతమంచి బాధ్యతగల అన్న ఉన్నందుకు ఎంతోగర్వించే వాళ్లు. వాణ్ణిఎంతో పొగిడేవాళ్లు, వాడి ప్రతిమాట వినేవాళ్లు.

## 4

చైనా సూర్యమానపంచాంగం ప్రకారం వర్షాకాలానికి యింకా చాలారోజులు పోవాలి, కనుక వాతావరణం బాగుండవలసింది కాని ప్రతిదినమూ ముసురుపట్టుకునేది. ఆకాశమంతా మబ్బులుకమ్ముకొని సూర్యకాంతి ఏమాత్రమూ కనిపించేదికాదు. ఎక్కడ చూసినా బురద, జారుడు. ఇండ్లలో గోడలనుండి సున్నంరాలిపడిపోయి గదులన్నీ నిమ్మగా, రొంపిగా ఉన్నాయి. ఇలాంటి వాతావరణానికి నిరాశా, నిరుత్సాహమూ రేకెత్తేవినాలో. అందుకే యిటువంటివాతావరణమంటే తగని అసహ్యం.

1927 వసంతం- రక్తసిక్తవసంతం। ఏప్రిల్ 12న చాంగ్కై-షేక్ కియాంగ్సు, చికియాంగ్రాష్ట్రాల్లో అధికారం కైవసంచేసుకున్నాడు (విప్లవఘాతుకంచేసి). విప్లవాన్ని వెన్నుపోటుపొడిచి కమ్యూనిస్టు విప్లవకారులను మూకుమ్మడి హత్యలు చేయసాగాడు. విప్లవవ్యతిరేకదాడి మొదట షాంఘైలో ప్రారంభమైంది. అప్పుడే హూనాన్లో విప్లవ ద్రోహులు(విప్లవవ్యతిరేకులు) ఇదే అదనని తలలెత్తారు. చాంగ్-షాలో 35వ సైనిక దళము ఇసుకబస్తాలు కుప్పలుగావేసి బజారుపోరాటానికి సిద్ధమైంది మే 19న కాల్పులు వినిపించాయి. అవి నగర దక్షిణద్వారంవైపునుండి వచ్చినట్లనిపించింది. మై-షెంగ్ తటాలున బట్టలుతగిలించుకొని ఏంజరుగుతుందో చూదామని బయటికురికాడు. పిల్లలం దరూలేచారు. పెన్వెన్ భయంతో బల్లిలాకరచుకుంది నన్ను.

"నాకు భయమైతుందే"అంటూ వెక్కి వెక్కి ఏడుస్తూంది.

"ఏంకాదులే భయపడకు"అంటూ తలనిమురుకుంటూ ధైర్యంచెప్పాను. 'బయట ఏంజరుగుతుందో చూడడానికి మీనాన్న బయటికివెళ్లాడుగా, మనం ఇంట్లో సురక్షితం గానే ఉన్నాము. భయపడవలసినపనేమీలేదు"

యింగ్-చీన్ ఇంకా కండ్లునులుముకుంటూనే ఉన్నాడు.

"తుపాకికాల్పేనా నాకు వినవచ్చింది"—యింగ్-చీన్.

"అవును. రైఫిల్ కాల్పుమాదిరిగానే వినవచ్చింది."

"దేన్నికాలుస్తున్నారే? ఎందుకూ పేల్చడమట్లా?" భయంనుండి తేరుకొని అడిగింది పెన్-వెన్.

"ష్ష్....బయట ఎవరో ఉన్నట్లుంది. చప్పుడుచేయకండి"అని హెచ్చరించాడు లి-యాన్.

బయట ఎవరోకాదు, మై-షెంగ్.

"ఏంజరిగింది?" లోపలికిరాగానే అడిగాను. కార్మికకర్షక గస్తీదళం (Worker-Reasant Inspection Corps) వాళ్ళోపదిమంది కొందరు దుర్మార్గులను ఎటోతీసుకు వెళ్తూ 35వ సైనికదళశిబిరము పక్కగా వెళ్లారట. ఇంకేముంది అయుధాలులాక్కున్నారు.

"పిల్లల్ని పడుకోబెట్టు. నేను కార్మికసంఘంవరకూ వెళ్ళి పరిస్థితేమిటో కనుక్కొనివస్తా."

"ఇప్పుడేపోకు, ప్రమాదం"అంటూ బ్రతిమాలాను.

"సంఘానికెప్పుడేముప్పువాటిల్లుతుందో చెప్పలేం. ఇటువంటప్పుడెవరైనా ఒక రక్కడ ఉండటం మంచిది. నువ్వు పడుకో ఈ ప్రాంతాల ఏమైనా గొడవ జరిగినా బెదరకు."

ఏంచెయ్యడానికీ తోచలేదు. ఆయన చెప్పేదంతా సబబే కనుక ఆటంకపరచదల చుకోలేదు. చివరికి సరే అన్నాను.

ఆరాత్రి మనశ్శాంతిలేదు. మై-షెంగ్ వెళ్లిన కొద్దిసేపటికే పుయాలివీధిలోరాష్ట్ర పార్టీకమిటీ ఆఫీసుకెదురుగాఉన్న 10 వ నెంబరు యింటికి నిప్పంటుకుంది. మంటలు త్వరత్వరగా ప్రాకాయి. ఆయుధోత్పత్తి ఫ్యాక్టరీ కార్మికులు కొందరు మంటలనార్పే ప్రయత్నంలో ఉరికొచ్చారు. వారు వచ్చిరావడంతోనే గాయపడ్డ సైనికులు కొందరు వారిమీదపడి చెదరగొట్టారు. ఆయుధాగారంపైపడి అక్కడి కాపలాదార్లనుండి ఆయుధాలు లాక్కున్నారు. రాత్రిఅంతా చాంగ్‌షాఅరుపులు పెడబొబ్బలతో మారుమోగింది.

భయంతో నాకు క్షణంసేపుకూడా కన్ను మూతపడలేదు. పిల్లల్నందర్నీ దగ్గరికిలాక్కుని తెల్లవార్లూ జాగరణచేశాను.

మై-షెంగ్ మరునాటి మధ్యాహ్నం వచ్చాడు. 305వ దళం కార్మిక సంఘాన్ని సంప్రదించిందట. ఇప్పుడు వారిద్దరు తమమధ్య ఏర్పడ్డ అపార్థాలను తొలగించుకొనే ప్రయత్నంలో ఉన్నారు. గాయపడ్డసైనికులు లాక్కున్న ఆయుధాలన్నీ తిరిగి యిచ్చారు. సైనికచట్టం (Martial law) అమలుజరిపి వారందరినీ ప్రధానశిబిరానికి పంపారు.

"ఎలాగైనా, ఇంకాకొందరు గాయపడిన సైనికులు శిబిరాన్ని ముట్టడించారు. ఎప్పుడేం జరుగుతుందో గట్టిగా చెప్పలేం."

"ప్రమాదమేమీ సంభవించదనుకుంటాను."

"హుం... ఏమో... ఏమైనా జరుగవచ్చు. భయమైతుందా?" అన్నాడు నావైపు చూస్తూ సాలోచనగా.

"నీతో వున్నంతవరకూ నాకణుమాత్రం భయంలేదు"

"నీవు ఒంటరిగాఉన్నా భయపడవద్దు," నాకు దగ్గరగా జరుగుతూ అన్నాడు. "ఆఁ ... అన్నట్టు మరచాను. నా ఉతికిన బట్టలు బయటపెట్టడం మరచేవుసుమా!"

ఇంత చిన్న మనవికూడా ఏదో అపశకునం సూచించింది. నామనసు దిగజారింది. "ఓరిదేవుడా? నిజంగానే ఏమైనా ముప్పువాటిల్లదుకదా!"

దుకాణాలన్నీ మూసివేశారు. ఎక్కడచూసినా అరాచకం, అల్లకల్లోలం. పిల్లల్ని బయటికి కదలవద్దని గట్టిగా చెప్పాను. మై-షెంగ్ సంఘానికిపోయేముందు ఏదో సలహాయిచ్చాడు. ఆ రాత్రే సుమారు ఆరుగంటల ప్రాంతాన కార్మిక కర్షక గస్తీ దళాన్ని నిరాయుధంచేస్తున్నట్లుగా ఊరంతా గుప్పుమంది,

మై-షెంగ్ కాగితాలనీ, పుస్తకాలనీ కొద్దిసేపు పరిశీలించాడు. వాటిలో చాల వాటిని కాల్చివేశాడు. తరువాత పూర్తిగా బట్టలుతొడుక్కునే మంచంమీద వాలాడు. ఆతురతతో రానున్నప్రమాదపు చప్పుడేదైనా వినిపిస్తుందేమోనని వినసాగాడు. ఆరాత్రి అవాంఛనీయ సంఘటనలేవీ జరుగలేదు. ఒకరోజు గడిచినతర్వాత సుమారు పదిగంట లరాత్రికి పిస్తోలు, రైఫిల్ పేలింగిచప్పుళ్ళకు నగరం నగరం అదిరిపడ్డట్లయింది. నగరంలో విడిసివున్న దళాల సేనాపతి సుకె-సియాంగ్ (Hsu Ke-hsiang) తిరుగుబాటు చేశాడు. కార్మికసంఘం, రాష్ట్రకర్షకసంఘం, కమ్యూనిస్టుపార్టీ అకాడమీ, మిగతా అన్ని ప్రజాసంస్థలను మూయకముందే దోచుకున్నారు, కార్మిక-కర్షక దళంవారినుండి బలవంతంగా ఆయుధాలు లాక్కున్నారు. రాష్ట్ర ప్రత్యేకన్యాయస్థానంపై దాడికూడా జరిపారు.

[సశేషము]

# భారతీయ తత్వశాస్త్రం-ఒక పరిశీలన

## 'ప్రజల చారిత్రిక దశలకు సంబంధంలేని తాత్విక చర్చలు మార్క్సిజానికి విరుద్ధం'

నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

తమకుతాము ప్రత్యేక హక్కులను ప్రకటించుకొనుట (declare) లోను, న్యాయ సూత్రాలను రచించుట, వాటికి భాష్యంచెప్పుటలోను, వాటిని ప్రభుత్వంచే అమలుచే యించుటలోను, సత్కర్మలను, దుష్కర్మలను విభజించుటలోను, ఒక్కమాటలో చెప్పాలంటే, సామాజిక అదనపువిలువల్ని పంపిణీచేసుకొనుటలోను బ్రాహ్మణ మతం అనుసరించిన పద్ధతులనే బౌద్ధమతంకూడ అనుసరించిందనేది చారిత్రక సత్యం.

అక్షయకుమార మజుందార్ తన హిందుచరిత్ర (పే. 458) లో ఇలా అన్నాడు. "నిరీశ్వరవాదులను, భౌతికవాదులను ఎదుర్కొనుటలో హిందువులు, బౌద్ధులు, జైనులు ఒకేవిధానాన్ననుసరించారు."

బౌద్ధమతం అవైదికధోరణి ఐనప్పటికి, మధ్యేమార్గంపేరుతో నాటికి ప్రబలంగ వున్న అవైదిక విధానాలను (Schools) హెచ్చుగ ఎదుర్కొంది. ఆవిధంగ, ఉపనిష త్తుల భావవాదానికి మద్దతు లభింపచేసింది. బౌద్ధుల 'ధమ్మ' (Code of morality) ప్రకారం తలిదండ్రులు, పెద్దలు, గురువులతోపాటు, బ్రాహ్మణులను గౌరవించాలనే నియమంవుంది. కాని ఇతర వందలకొద్దివున్న స్కూళ్లను బౌద్ధం ఏమాత్రం గౌర వించలేదు. భౌతికవాదాన్ని గౌతముడు, బౌద్ధమతం బాగ ఎదుర్కొంది.

విముక్తిమార్గం, రెండు మతాల్లోను సన్యాసత్వమే. బ్రాహ్మణ మతంలోని మోక్షకు, బౌద్ధంలో తాంత్రికబునాదిని (dogmatic touch) లోతులు పెంచి, 'నిర్వాణ' పేరుపెట్టారు. యజ్ఞాలవల్ల ఈజన్మలోనే లభించేమోక్షాన్ని, ఈ జన్మలోగాని, ఉదు పరిజన్మలోగాని 'నిర్వాణ' పొందగలఆశ, అవకాశాన్ని పెంచారు. మతనమ్మకపు లోతుల్ని పెంచి, గమ్యాన్ని ప్రజలకు దూరంగ జరిపేసింది బౌద్ధమతం.

ఉపనిషత్తుల్లో మేధావులు చర్చిస్తున్న, "ప్రాపంచికరహస్యచ్ఛేదకకృషి (Cause of the universe) యొక్క పొడిగింపే, గౌతముని 'కార్యకారణ' (Cansation theory) సిద్ధాంతం, యజ్ఞయాగాదులద్వారా పొందే సుఖాలు తాత్కాలికమంటూ, శాశ్వితసుఖాలను బోధించారు బౌద్ధులు.

స్త్రీలకు బ్రాహ్మణమతం, అర్ధభాగాన్ని అట్టిపెడితే బౌద్ధులు వారి పతనాన్ని పూర్తి చేసివేశారు.

బ్రహ్మజ్ఞానం పర్ణకుటీరాలమధ్యనుంటే, బౌద్ధజ్ఞానం చల్లని మామిడితోటల మధ్య. బ్రాహ్మణస్మృతులు పట్టణ సంస్కృతిని, పరిశ్రమలచప్పుడును ద్వేషిస్తే, బౌద్ధుల పవిత్రగ్రంథపఠనం, భిక్షుకులమకాంలు ప్రజలమధ్య నిషేధం.

నిజానికీ వుద్యమనాయకుడు గౌతముడుకాదు. జ్ఞానం బ్రాహ్మణులకొక్కరికే చెందాలనే బ్రహ్మర్షి వశిష్ఠవాదనను, రాజర్షి విశ్వామిత్రుడు సవాల్ (Challenge)చేశాడు. కొంతవరకు సఫలీకృతుడయ్యాడుకూడ.

ఈ విధంగ రెండు మతాలను పరిశీలించిచూస్తే, వీటి సామ్యత స్పష్టపడుతుంది. వీటిమధ్యనున్న భేదం, అవి ప్రతిబింబించే ఆయావర్గాల భౌతికపరిస్థితుల్లోవుంది.

బౌద్ధమతం 'మధ్యేమార్గం' పేరుతో సనాతన సంస్కృతితో రాజీపడ్డది. దీనికి కారణం, భారతీయ ఫ్యూడల్‌వర్గాలు, బానిసవర్గ యజమానులతో రాజీపడటమే.

పాలకవర్గాల దోపిడీకుపయోగపడ్డ ఈమతాలను, ఆ మతప్రవక్తలను భారతీయ తత్వశాస్త్రరచయిత పొగడటానికి కారణం, ఆయనలోని భావవాదమే. ఈ దృష్టి మార్క్సిజానికి పూర్తి వ్యతిరేకం.

## వైదిక సమాజము

భారతీయ తత్వశాస్త్రరచయిత, వేదాలనుగురించి జరిపిన పరిశీలనలో, ఆ మంత్రాల రచయితల భావాలనుగురించి మాట్లాడాడు. నిజానికాతడు చెయవలసింది, ఆకాలపు ప్రజల జీవితవిధానపు పరిశీలన. అంటే వైదికప్రజల ఉత్పత్తి విధానము, వర్గపోరాటము మొదలగు వివరాలనుగురించి వివరించవలసివుంది.

ఋగ్, యజుర్వేద సమాజపు ప్రజలు అనుసరించిన వృత్తులనుగురించి 'హిందు చరిత్ర' (Hindu History) లో అక్షయకుమారమజుందార్ అను చరిత్రకారుడిలా వ్రాశాడు. "నాటిప్రజా సామాన్యం, వ్యవసాయదార్లు, వ్యాపారులు, వేటగాళ్లు, వైద్యులు, వంటపనివారు, వడ్రంగులు, విల్లంబులుచేయువారు, గుర్రాలు, ఏనుగులు మేపువారు, కమ్మరులు, కుమ్మరులు, కవులు, నటకులు, రథచోదకులు, కాల్బలము, బంగారుపనివారు, జ్యోతిష్కులు, ద్వారపాలకులు, రంగులద్దువారు, చాకలి, మంగలి, తోళ్ళపనివారు, నేతపనివారు మొదలగు 35 రకాల వృత్తులకుపైగా చీలి వుత్పత్తిలో పాల్గొన్నారు.

నాగళ్లు, కొడవళ్లు మొదలగు వ్యవసాయపనిముట్లు, రథాలు, కత్తులు, విల్లంబులు మొదలగు యుద్ధపనిముట్లు తయారుచేయు పనివారున్ను. కోటలు, గ్రామాలు

మొదలగు నిర్మాణ పని నిపుణులు ఋగ్వేదకాలంలో వున్నారు. పడవలు, నాగళ్లు, రథాలు, ఆయుధాలు, పాత్రలుచేయు పనివారిని "తక్షణులు" అన్నారు.

నేతవృత్తి పనివారికి అస్పులిచ్చినట్లు 9 మండలం, 20 సూ. 7 వ మంత్రం వివరిస్తోంది.

ఋగ్వేదం I. 10 56.2 మంత్రం ప్రకారం వర్తకం, నౌకావాణిజ్యంవున్నట్లు తెలుస్తోంది. కొండలనుండి, అడవులనుండి సోమలతలుతెచ్చి అమ్ముతుండే వ్యాపారులున్నారు. కృశానుడనుఋషి సోమలతలవ్యాపారి.

నాటి దేవుళ్ళ ప్రతిపోలిక, మతరీత్యా, తత్వరీత్యా, వడ్రంగులతోను, కమ్మరులతోను, రాజులతోను పోల్చిచెప్పటం, నాటి చేతివృత్తుల అభివృద్ధికిసూచనగ తీసుకోవచ్చు. ఈ చేతివృత్తులపనివారు, వీరితోపాటు వస్తుమార్పిడి కవసరమగు లోహాలు, లేక నాణేలు, క్షత్రియవర్గ అభివృద్ధికి, వ్యాపారవర్గాభివృద్ధికి బునాదినివేశాయి, పాత పశుపాలన ఆర్థికవిధాన విచ్ఛిత్తికి మార్గాన్ని తెరచిన యీ పరిస్థితులు, వేదిక్ వర్గ పరిధిలోని రక్తసంబంధాలను, ఆధిక్యతను కూలద్రోశాయి.

లోహయుగం (Iron age) సప్తఋషులతో ప్రారంభమైందని అక్షయకుమార మజుందార్ తన 'హిందుచరిత్ర' (Hindu History–Page 114) లో వివరించాడు. "సోమక్రయణి" అనే ఒకరకమైన నాణెం'శుల్క'అనే రాగినాణెం అమల్లోవున్నట్లు VIII–1–5 ఋగ్వేదమంత్రంనుబట్టి తెలుస్తోంది. బంగారం, ఇనుంకొరకు ఋషుల ప్రార్థనలున్నాయి.

R.V. II and V మండలాల్లో గ్రామపతి, నగరపతి ప్రస్తావనవుంది, దీన్నిబట్టి నాటి సమాజంలో రాజకీయ నిర్మాణంకూడ వుందని తేలుతోంది.

భాగ్యం ప్రధానంగ రుగ్వేదప్రజలు జీవించినట్లు, వాటిలోని ధనస్తులే రుజువు. వీటిల్లో ప్రత్యేకంగ తెగలు, రాజులు, రాజవంశాలు మాత్రమేగాక పురోహితులకుటుంబాలు, వంశావళులగురించి, రాజుల వుదారబుద్ధినిగురించికూడ వుంది.

## ఋషుల వర్గస్వభావము

దేవరాజచనన M.A.Ph.D. తన 'పురాతన భారతదేశంలో బానిసత్వం' అనే పుస్తకంలో ఇలావ్రాశాడు. "తండ్రికి ఆస్తిపై పూర్తిహక్కుతో, జాయింటు కుటుంబ విధానంతో, వేదకాలపు సమాజం బానిసలు, బానిస యజమానులుగ చీలి వుంది, ఆ

ప్రజలు భాగ్యంప్రధానంగ ఎంచినట్లు వాటిలోని ధనస్తుతులు రుజువుచేస్తున్నాయి. భాగ్యం పోగయితే దాసుడు ఆర్యుడుకావచ్చును అని R.V VI 22–10

....ఆర్యనుల క్షేమంకొరకు దాసదాసీజనాభాను మూకవుమ్మడిగ చంపేయవచ్చు. వారి ఆస్తివి లాక్కోవచ్చును అని R.V. I 19-8, V. 34-6, VI. 25-2, VIII. 40-6 వివరిస్తున్నాయి.

యాజ్ఞవల్క్యుడు లాంటి రుషులు, కుమారిలలాంటి పండితులు, రాజులనుండి బానిసలను పొందారు. పొలాలు, గొర్రెలు, ఎద్దులసరసన దాసదాసీలుకూడకలిపి ఆస్తిగ లెక్కించబడ్డారు.

100 దాసీలను బహుమతిగపొందిన మంత్రాలున్నాయి. ఒకరుషికిచ్చిన దక్షిణలో ఒకభాగంగ, పది రథాలనిండ బలవంతంగ ఎత్తుకురాబడ్డ దాసీలు బహుమతిగయివ్వటం జరిగింది

బానిసయజమాని వర్గమైన రుషులపై బానిసలు తిరుగుబాటుచేసిన ఘటనలగురించి R. V. I 22-158 మంత్రం వివరిస్తోంది. ఐతే భారతదేశంలోని యీ తిరుగుబాట్లు రాజకీయ విప్లవరూపం తీసుకోలేదు. అనగా బానిసలు ఒకవర్గంగ వారి యజమానులపై తిరుగుబాటు జరపలేదు. వ్యక్తిగతసంఘటనలనుగురించి మాత్రమే మనకు వివరణ వుంది. అందుచేతనే ఫ్యూడల్ సమాజంలోకూడ అశోకుడు, గుప్తరాజులకాలంలో సైతం బానిస ఆర్థికదోపిడీవిధానం అమలుజరుగుతూనే వచ్చింది. ఈ ఆర్థికపరిణామ ఫలితాలే సామాజిక సూత్రాల్లోను, మతప్రచారంలోను కన్పిస్తుంది. దీన్నే భారతీయ తత్వశాస్త్రరచయిత, అర్థబానిసవిధానం, పావుబానిసవిధానం అని పిల్చాడు.

భారతీయ పవిత్రరుషులు గొప్ప వడ్డీవ్యాపారులుగకూడ పేరుపొందారు. 10 వ మండలకర్త ఐన నాసదీయ సూక్తరచయిత, శ్రీదీర్ఘతమస్సి గొప్ప వడ్డీవ్యాపారి. అతని బానిసలు ఎదురుతిరిగి, తలమీద గంట్లుపెట్టి ఏటిలోపడద్రోసినట్లుR.V. I. 22·158 చెబుతోంది.

కణ్వమహర్షి తన అప్పులవాళ్లు వడ్డీయున్ను, అసలుకూడ చెల్లించుటలేదని, అవి సరిగ వసూలయ్యేట్లు చేయమని ప్రార్థించిందే 1-38-15,16 మంత్రాలు. ఈ కణ్వుడే ఒకచోట ఇలాఅన్నాడు. "నేను గౌతముని అడుగుజాడల్లో నడచుటవల్ల ఇంతధనికుణ్ణి కాగల్గాను." అని.

గౌతముడు మరొక ధనికరుషి.

దీర్ఘశ్రివుడనురుషి ఒక పెద్ద వర్తకుడు. I. 112-11

I. 10-11 మంత్రంలో ఒక రిషి ప్రార్థిస్తున్నాడు. "నన్ను వేలకొలది లాభములుగల రిషిని చేయుము."

ఐతే వ్యాపారాల్లో నష్టపోయిన రుషులుకూడ వున్నారు. 'అజీగర్తు'డను రుషి మరొకరుషికి చెల్లించవలసిన బాకీని, వడ్డీని చెల్లించుటకై తన కుమారుడైన శునశ్శేపుణ్ణి అమ్మకున్నాడు.

అనేకమంత్రాల్లో రుషులు ఇంద్రుణ్ణి ప్రార్థించినకోర్కెలు ఏమిటి? 'అరి' యొక్క ధనాన్ని బలవంతంగ దోచుకొచ్చి మాకివ్వవలసిందని.

60 వేల గుర్రాలు, 10 వేల పాడియావులు, 20 వందల ఒంటెలు నేను పొందగల్గానని బడాయిలు చెప్పకున్న పూజార్లు దానస్తుతుల్లో కన్పిస్తారు.

ఈ విధంగ రుషులు బానిసయజమానులుగాను, వ్యాపారులుగాను, అమిత ధనవంతులుగాను, సమిష్టికుటుంబపెద్దలుగాను, పూజారులుగాను, రాజసలహాదారులుగాను ఒక్కమాటలో నాటి వైదిక సమాజాధిపతులుగ, రాజులతోసహా మొత్తం ప్రజలందరిని అదుపులో వుంచారు. ఉత్పత్తిసాధనాలైన భూమి, బానిసలు, పశువులు మొదలైన వాటినేగాక ఉత్పత్తిపనిమీట్లపైనగూడ పూర్తి యజమాన్యం వహించివున్నారు. ఉత్పత్తి కారకులైన ప్రజాసామాన్యాన్ని వాటినుండి దూరంచేశారు. తమ హక్కుల్ని తామే నిర్ణయించుకుంటూ ఇతరులందరికి విధులను ఆజ్ఞాపిస్తూ రాజులచేత అమలుచేయించారు.

## దోపిడీవర్గ సమర్థన.

ఈరకమైన దోపిడీవర్గాన్ని భారతీయ తత్వశాస్త్రరచయిత ఎంతచక్కగ సమర్థించాడో గమనించండి.

"ఆర్యుల మతభావాలను వెలిబుచ్చే గ్రంథాలు వేదాలు. ఋగ్వేదం, సామవేదం, యజుర్వేదం, అధర్వణవేదం అని యివి నాలుగు. ఋగ్వేదం అతిప్రాచీనమైనది. ఇందులోని కొన్ని సూక్తులు ఆర్యులు మధ్యఆసియాలోవుండగా రచింపబడ్డవి.

మానవుని జీవితానికత్యవసరమైన ప్రకృతిశక్తులన్నిటినీ వారు దేవతాభావంతో పూజించేవారు. నిప్పు మానవజీవితానికత్యవసరమైనది.

వేదకర్తలకు కవితావేశం హెచ్చు. వర్ణనలు, అతిశయోక్తులు, ఉత్ప్రేక్షలు వేదసూక్తాల్లో కొల్లలు. తమ నిత్యజీవితానుభవాలను ఉత్ప్రేక్షించి, సూక్తాలరూపంలో వెలిబుచ్చగలవారి మేధోశక్తిఫలితమే వేదరచన." (P. 12)

వేదరచయితలు తమ నిత్యజీవితానుభవాలను, సూక్త రూపంలో వెలిబుచ్చారన టం, బానిస యజమానుల దుష్టకోర్కెలను సమర్థించడమే వౌతుంది. వర్తకులు వడ్డీ వ్యాపారులు, పురోహితులు, బానిస యజమానులతో కూడిన నాటి దోపిడివర్గ జీవితవిధా నాన్ని, ప్రజల జీవితవిధానంకింద ఈ రచయిత మనకు బోధిస్తున్నాడు. ఉత్పేక్షలు, అతిశయోక్తులు అల్లగల్గేట్లు విశ్రాంతిగ కూర్చొని తినగల్గిన ఈవర్గానికి భోజనం ఉత్పత్తి చేసిపెట్టిన వర్గాన్ని గురించి ఈ పుస్తకంమొత్తంలో ఒక్క మాటకూడలేదు. పైగా ఋషులు తమ నిత్యజీవితానుభవాలను మనకు చెప్పారట. పరాయి కోటలు పగలగొట్టిరమ్మని, పరాయికొంపలు పీకిరమ్మని, పరాయిపశువుల్ని తెచ్చిపెట్టమని ఇంద్రుని ప్రార్థించటం వారి నిత్యజీవితానుభవమా? శూద్రునికాళ్ళల్లోను, బ్రాహ్మణుల్ని ముఖంలోనుపుట్టించటం మానవజీవితావసరమా? అగ్ని ధనధాన్యాల్ని ఋషులకు తెచ్చివ్వటం సమాజఅవసరమా? వీరు దేవుళ్ళను భౌతిక సంపదలకొరకు చేసిన ప్రార్థనలు వారి మేధోశక్తి నిదర్శనమా? వేదాల్లోవున్న విషయాన్నుండి మనల్ని దారిమళ్ళించటంలోనివుద్దేశ్యం, ఆ వర్గపుదోపిడీ భావాల్ని సమర్థించటమే.

ఆర్యులు మధ్యఆశియానుండి వచ్చారని, ఋగ్వేదంలో సగం అచటనే రచించా రని, మిగిలిన సగం ఇండియాలో వ్రాశారని శలవిచ్చారు ఈ రచయిత. ఇదేనిజమైతే ఋషులు, వారి సగోత్రీకులైన బ్రాహ్మణ కుటుంబాలు భారతదేశానికి విదేశీయులౌతారు. బ్రాహ్మణ మతం పరాయిమతమైపోతుంది. దీన్ని హిందుమతస్థులు జీర్ణించుకోగలరా? వేదాల పరిశీలనఅంటే ఇదేనా? వేదాలు అపౌరుషేయాలనే పాతవాదనను అధునాతనం చేసి, ఋషుల మేధోసంపత్తిని, అమాయకత్వాన్ని చిత్రించ బూనుకున్నాడు. డొంక తిరుగుడుగ వారిని పొగుడుతున్నాడు.

## వేదాలెన్ని?

వేదాలు నాలుగుఅని చెప్పటం భావవాదులకు పరిపాటి. ఋగ్వేదంతోపాటే అధ ర్వవేదంకూడ కలిపి చెప్పటంద్వారా, క్రీ శ. 6 శతాబ్దపు విధానాలను, ఋగ్వేదంలో పదవమండలంగ చేర్చటంద్వారా బ్రాహ్మణమత నిర్మాణం జరిగింది.

విషయపరిశీలనకుబూనుకుంటే ఋగ్వేదానికీ, అధర్వవేదానికిమధ్య ఒకచారిత్రక దశ అంటే దాదాపు వెయ్యి సంవత్సరాల భేదం కన్పిస్తుంది. ఋగ్వేదం బానిస ఆర్థిక విధానపు ప్రతిబింబం ఐతే, అధర్వవేదం ఫ్యూడల్ ఆర్థికసంబంధాల ప్రతినిధిగ తేలు తోంది.

ప్రసిద్ధిచెందిన చరిత్రకారుడు శ్రీ భండార్కర్ గారు, తన పరిశోధనా గ్రంధం Vol I. P. 232 లో ఇలా వ్రాశారు. "అధర్వవేదం ప్రతి విషయంలో, మిగిలిన మూడు వేదాలతో భేదిస్తోంది. ఇది అబ్రాహ్మణరచన (Non-Brahminical Inspiration) ఈ విషయం దానిలోని 'ఖిలమంత్రాల' ద్వారా పూర్తిగ నిరూపించ బడ్డది. దీనిలోని 'కుంతపసూక్తాలు'అనబడేవాటి కేమాత్రం పవిత్రతా ప్రాముఖ్యం లేన ప్పటికీ అవి తరతరాలు భద్రంగ వుంచబడ్డాయి. అవి ముఖాముఖి అందించబడటానికి ఒకేఒక కారణం కన్పిస్తోంది. ప్రజాసామాన్యపు సంస్కృతికవి అందుబాటులో లేనివి. (They were indespeusable for a popular cult)పూజారులకోవలో అవి బలవంతంగ అంగీకారంపొంది తరతరాలుగ అందించబడ్డాయి."

బ్లూంఫీల్డు అనే ఇంగ్లీషు పండితుడిలాఅన్నాడు "అధర్వవేదం పూర్తిస్వతంత్ర కోవకు (tredition) చెందినదానిలాగ కన్పిస్తోంది. ముఖ్యంగ 'కుంతపసూత్రాల'కే మాత్రం పవిత్రతా లక్షణాలు లేవనేది సువిదితం."

భారతీయ చరిత్రకారుడు శ్రీ ఘోష్ ఇలావ్రాశాడు, "అధర్వవేదానికి, మిగిలిన మూడు వేదాలకు చాలభేదముంది. సోమసంస్కృతిలో దీనికెన్నడు స్థానంలభించలేదు. ఆఖరివరకు గుర్తింపబడకుండానే మిగిలిపోయిందీవేదం. ఇది సామాన్యప్రజలప్రార్థనా గ్రంధం. భూతప్రేతాలవేటలో వారికిది పూర్తి ధైర్యాన్నిచ్చింది. బ్రాహ్మణులు దీన్ని చక్కగ వుపయోగించుకున్నారు. (Exploited)

శ్రీ ఘూట్ వుపన్యాసాల్లో దీన్నిగురించిలావుంది. "అధర్వవేదం చాలఆలస్యంగ రచించబడ్డది. దీనికి బ్రహ్మవేదమనే పేరుకూడావుంది. బ్రాహ్మణ పూజార్లు యజ్ఞ యాగాదిక్రతువుల్లో వుపయోగపడే వేదమిదే. ఋగ్వేదంలోని అసలైన నిష్కపట వుత్సాహం (Spirit) దీనిలో పూర్తిగ పతనంచెందింది. దీనిప్రకారం, ప్రపంచంలో ప్రతిదీ యజ్ఞానికి లోబడే. మానవుల ప్రతి కోర్కెకు ఫలితం దీనిలోదొరికే అవకాశం వుంచారు. రాజుగారు శత్రువులను ఓడించగల మంత్రాలనుండి, శెట్టిగారి బోడిగుండుపై వెంట్రుకలు మొలిపించగల మంత్రాలు, మందులు, యజ్ఞాలు వున్నాయి దీనిలో."

డాక్టర్ అంబేద్కర్ రచించిన 'అంటరాని'వారు అనే పుస్తకంలో

"ఋగ్వేదీయులసృష్టి మనువుతో ప్రారంభించబడితే అధర్వవేదీయుల సృష్టి బ్రహ్మతో ప్రారంభమౌతుంది. ఋగ్వేదీయులది యజ్ఞసంస్కృతి ఐతే అధర్వులది తాంత్రికం (magic) - ఋగ్వేదజనం అధర్వవేదాన్ని ఆమోదించలేదు."

రుగ్వేదీయులు వృత్రాసురవధను సమర్థించితే అధర్వులు అది బ్రహ్మహత్యా పాతకం అన్నారు. తదుపరి ప్రక్షిప్తమైన 10వ మండలంలోతప్ప రుగ్వేదానికి బ్రహ్మ తెలియదు. బ్రాహ్మణులు పాత సంస్కృతి వారసులుగ ఆ గోత్రీలకొరకీ మండలం చేర్చబడింది.

అధర్వవేదం పూర్తి భావవాదధోరణికి చెందింది. రిగ్వేదంలో కవితావేశము, అతిశయోక్తులమధ్యలో ధనస్తుతులు. సోమపానస్తుతులు, ఆర్థికచింతనతోకూడిన ఋగ్వేద చార్వాకులు కనిపిస్తారు. అందుచేతనే వస్తువాహనాదులకై భౌతికసుఖాలకై ప్రార్థించిన వేదజ్ఞానం చౌకబారుదైంది. భారతీయ ఆత్మ. పరమాత్మలచింతనకిది దూరమైంది, అందుకే వేదాంతం అవసరమైంది.

## వైదిక మతం

"ఋగ్వేదం అతిప్రాచీనమైనది. ఇందులో విజయంసాధించిన ఆర్యుల ఆనంద పారవశ్యం, ప్రకృతిఆరాధన, అచ్చటచ్చట తాత్వికచింతన కనబడుతుంది. ఆ తర్వాత సామవేదం ఏర్పడ్డది. ఋగ్వేదంలో ఋక్కులను ఏవిధంగ గానంచేయాలన్నవిషయం తప్ప అదనంగ ఏమిలేదు .. అర్థంతెలియకుండా, వేదాలను గానంచేసే పురోహిత వర్గం ఒకటి ఏర్పడ్డది.

తర్వాత యజుర్వేదం ఏర్పడ్డది. యజ్ఞవేదికవివరాలు. ఏ పురోహితుడే మూల కూర్చొని యజ్ఞంచేయించాలి మొదలైన కర్మకాండను వివరించేది.

తర్వాత అధర్వణవేదం. ఇందులో పైవిషయములతోపాటు ప్రజాసామాన్యంలో నాడు విశేషంగ వ్యాపించివున్న మూఢనమ్మకాలు, దయ్యాలు, ప్రయోగాలు, వాటికి ప్రతిక్రియలు మొదలైనవి వున్నాయి." (Page 22)

ఇదీ భారతీయ తత్వశాస్త్రరచయితయొక్క నాలుగువేదాల పరిశీలన, ఈపరిశీల నలో పూర్తి అనారోగ్యకరమైన విషయమేమంటే, ప్రజాసామాన్యంలోని మూఢనమ్మ కాలతో అధర్వవేదం రచించబడిందని చెప్పటం. ఏ ప్రజల మూఢనమ్మకాలివి? అవి అసలు ప్రజల నమ్మకాలా? లేక ప్రజలు నమ్మాలని పూజారులుకోరే నమ్మకాలా? దెయ్యాలు, భూతాలు కష్టించే ప్రజాసామాన్యానికి కన్పిస్తాయా? లేక తీరుబడిగకూర్చొని ఆలోచించగలవారికి కన్పిస్తాయా?

ఈ మంత్రాల్లో ప్రజాసామాన్యానికి కన్పించే ఒకే ఒక హెచ్చరిక మాత్రం వుంది, బ్రాహ్మణాధిపత్యాన్ని ధిక్కరిస్తే పైన 'నరకం', క్రింద 'రాచరికం' నాటి

వేదరచయితల వర్గప్రయోజనాలుకాపాడే నిరంకుశరాజు, ప్రజాసామాన్యపుపాలిటి పెద్ద యమధర్మరాజు.

పట్టాభిషేకపు కాలంలో ఒక రాజదండాన్ని పురోహితుడు కొత్తరాజుకందిస్తూ, దీన్ని దేవుడుపంపించాడని చెబుతాడు. దీన్ని అమోదించి, క్షత్రియులు ఉపనిషత్తులు చేతబుచ్చుకొని బయలుదేరారు, 'నావిష్ణుపృథ్వీపతిః' రెండువర్గాల అమోదంపొందింది. మాటలో 'దైవం'— చేతిలో 'దండం'— అధర్వవేదదైవం న్యాయసూత్రాలు రచిస్తే, ఉపనిషత్తుల 'దండం' వాటిని అమల్లోపెట్టటం ప్రారంభమైంది.

చరిత్రకారుడు శ్రీ 'ఘూట్ ఉపన్యాసాలు' 128 పేజీలో ఇలావ్రాశాడు.

"వైదికమతం ఉన్నతవర్గాలకు (upper classes) మాత్రమే చెందింది. ధనిక, వుదారపు (Liberal) గృహస్తు మాత్రమే దీన్ననుసరించగలడు. విలువైన సంబరాలు, అంతకంటే హెచ్చుగవుండే పూజారి దక్షిణలు సామాన్యులెవరు అనుసరించవీలులేనివి. అధర్వవేద గృహ్యసూత్రాల కాలానికీమతం మధ్యమవర్గీయుల కందుబాటుకొరకు దించ బడింది, ఐతే అప్పటికే మతంలో కొన్ని మందులు, మంత్రతంత్రాలుకూడచేర్చబడ్డాయి.

వైదిక పూజార్లు ఈ మంత్రతంత్రాలద్వారా, ధనకనకవస్తువాహనాదులను దేవుళ్ల చేత రాజులకు, రాకుమారులకు, ప్రభువులకు, ధనికవర్తకులకు, భూస్వాములకు యిప్పిస్తారు. వారినుండి వీరు కేవలం దక్షిణలు, బహుమతులు (fees and gifts) మాత్రమే పుచ్చుకుంటారు, ఇచట గమనార్హవిషయమేమంటే దేవుళ్లు ఈ వస్తువాహనా దులను సూటిగ తమను లొంగదీసే పూజార్లకివ్వరు. పేదవాళ్ళకుకూడ యివ్వలేదు. ఈ రహస్యం ప్రజాసామాన్యాని కర్థమైంది. కనుకనే యజ్ఞయాగాదుల సంస్కృతి దెబ్బతింది, కనుకనే ఉపనిషత్తుల భావవాదం అవసరమైంది. నాటి సాంఘిక ప్రయో జనంకొరకు కాదు. తమ వర్గప్రయోజనాలకొరకే. దీన్నే మూర్తిగారుఆనాడది సమాజా నికి లాభం కల్గించిందని అన్నాడు.

రాజకీయంగచూస్తే, తెగలనుండి జాతులు, ప్రభుత్వాలుగ మార్పుచెందుతున్న దశ అది. ఆర్థికంగ బానిసశ్రమ దోపిడీ పద్ధతి, ఫ్యూడల్ ఆర్థిక దోపిడీ విధానానికి మార్పుచెందే భౌతికబునాదిపై అధర్వవేదం, ఉపనిషత్తుల భావవాదం బయలుదేరింది. దోపిడిరేటు అధికం కావటంవల్ల బాధపడే ప్రజలకవసరమగు మత్తుమందే ఉపనిషత్తుల భావవాదం. సాంఘికపతనానికి తోడ్పడ్డది. ఈ వుపనిషత్తుల భావవాదం, సాంఘిక పరిణామాభివృద్ధికొక పెద్ద ఆటంకం. ఇది పురాతన ప్రపంచపతన చిహ్నం, దీనివల్ల

కష్టించి వస్తూత్పత్తి చేసే చేతులకంటే, సోమరిగకూర్చొని ఆడించే మెదడుకే ప్రాధాన్యత (చైతన్యం). ఈ సోమరిపోతు మెదడులే, రాజదండం అండతో, కష్టించే చేతుల్నికట్టి వేశాయి. ఆవిధంగ వస్తూత్పత్తికీ భావవాదం బద్ధశత్రువు.

ఈ వైదికమతాధిపతులు వేదాలను యితరులు చదవరాదంటూ, వాటి పవిత్రతను రుజువుచేశాడు. ప్రజలకర్థంకాని మంత్రాలను చదవటంద్వారా తమ గొప్పతనాన్ని చాటుకున్నారు. చదువుకోరాదని నిషేధిస్తూ, ఇతరులందరు అజ్ఞానులన్నారు. తపస్సు చేసినవాళ్ళను చంపిస్తూ(శంబుకవధలు)భక్తి కల్గి వుండాలన్నారు. అందుచేత వైదికమతం అభివృద్ధినిరోధకమైంది.

## ఉపనిషత్తులు

భారతదేశంలో గతితార్కికదృష్టి ఎలా అభివృద్ధిఐందో వివరిస్తూ, ఉపనిషత్తలనుగురించి శ్రీ యేటుకూరి బలరామమూర్తి గారీక్రింది అభిప్రాయాలు శలవిచ్చారు.

"వైదిక కర్మలు దేశంలో మతవిద్వేషాలనూ, అంధవిశ్వాసాలనూ కల్గిస్తున్న దశలో, అందుకు ప్రతిచర్యగా మతసామరస్యాన్ని, నిరాకార నిర్గుణభావాన్ని, అందరిలోవున్న ఆత్మ సమానమన్న భావాన్ని బోధించి, ఐక్యతకు దోహదంచేసినవి ఉపనిషత్తులు." (Page 196)

"వైదిక వాఙ్మయంలో చెల్లాచెదరుగవున్న తాత్వికభావాలను క్రోడీకరించి, వర్గీకరణచేసి, వానిలో మూలపదార్థమేదో తెలిసికోటానికి ఉపనిషత్కారులు కృషిచేయవలసి వచ్చింది. ఈ కృషి జరగకపోతే, భారతీయ తత్వశాస్త్రం ఒక ప్రత్యేక విజ్ఞానశాస్త్రంగ అభివృద్ధిఅయ్యే దేకాదు. ఈ పరిశీలనాక్రమంలోనే జడాత్మకదృష్టి తలెత్తింది. (Page 51) .... కనుక చారిత్రిక పరిణామక్రమంలో జడాత్మకపద్ధతికొక సాంఘిక ప్రయోజనముంది. అంతకుమందున్న బహుదేవతాధోరణిని, ప్రకృతిశక్తుల ఉపాసనను, కర్మ ప్రధానమైన మతాచారాలను నీరసించి అంతకంటే వున్నతమైన భావవాద తత్వవిచారణ రూపొందేందుకు ఈపద్ధతి యెంతగానో వుపకరించింది." (Page 51)

ఇది పూర్తిగ దుందుడుకు భావవాదులధోరణి. ఎందుచేత?

ఉపనిషత్తుల ధోరణి 'జడాత్మకపద్ధతి' అని అంగీకరిస్తున్నారు. ఉపనిషత్కర్తలు కనుక కష్టపడి యీ ధోరణిని నిర్మించి వుండకపోతే, భారతీయ తత్వశాస్త్రం ఒక ప్రత్యేక విజ్ఞానశాస్త్రంగ అభివృద్ధిఅయ్యేదే కాదంటున్నారు అంటే యీ రచయిత భారతీయ భౌతికవాదాన్ని- (ఇచటనేకాదు. ఈ పుస్తకంపొడుగునా ఎచటకూడ)అంగీకరించు

టలేదు. పైగా భావవాదం సంఘానికి ప్రయోజనం కల్గించిందని అంటున్నాడు. అందరిలోవున్న ఆత్మ– శూద్ర ఆత్మ. బ్రాహ్మణ ఆత్మ– సమానమన్న భావాన్ని బోధించి ఐక్యతకు దోహదంచేశాయనికూడ అంటున్నాడు.

జడాత్మకదృష్టి. భావవాదధోరణి పాలకవర్గాలసృష్టి అనేది జగద్విదితం. అది జరిగివుండకపోతే, నిజాయితీతోకూడిన భౌతికవాదధోరణులు ప్రబలి సంఘానికి కొంత మేలు జరిగి ఉండేది. ఈ రచయిత దృష్టిలో ప్రజలు అంటే పాలకవర్గాలే అనేది స్పష్టంగ ఈ క్రిందివిషయాలుపరిశీలిస్తే అర్థమౌతోంది ఈయనదృష్టిలోని ప్రజలెవరో?

"పై సిద్ధాంతాలన్నీ తత్వవిచారణలో మునిగిన మేధావివర్గానికే పరిమితమైనవి-ప్రజాసామాన్యంలో ప్రవేశించలేదు. ఐతే ప్రజల వాస్తవిక జీవితానికి సంబంధించిన సమస్యలపైనకూడ ఉపనిషత్తులు కొన్నిఅభిప్రాయాలు వెలిబుచ్చినవి' అన్నాడు. (P. 29)

"మానవుడు ఈజీవితంలో అనుభవించే సుఖదుఃఖాలకన్నిటికి, వెనుకటిజన్మలో చేసిన'కర్మ' మూలకారణమన్న సిద్ధాంతం మొదటిసారిగా ఉపనిషత్తుల్లో రూపొందించబడ్డది."

"సత్కర్మలు చేసినవారు వచ్చేజన్మలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యకులాల్లో ఏదో ఒకదానిలో పుడతారు. చెడుపనులు చేసినవారు కుక్కజన్మ, పందిజన్మ లేక చండాలజన్మ (శూద్రజన్మ లేదా?) పొందుతారు." (Page 29)

ఇదీ ప్రజల వాస్తవిక జీవితమని, మనకు నేడు వీరు బోధించే విషయాలు. దీని మీద ఇంక వివరణ అవసరమా?

నిజానికి ఉపనిషత్తుల రచన అనేక శతాబ్దాలుగ కొనసాగింది. బానిసవిధానపు సామాజికదశలో ప్రారంభమైన ఈ జిజ్ఞాస, నిరంకుశ రాజరికపుదశలో చాలకాలంవరకు జరుగుతూనే వుంది. ఉత్తర భారతదేశపు తెగల్లో పని విభజన ప్రాథమిక రూపంలో (Crude form) వున్నపుడు ప్రారంభించబడ్డ ఈరచన, వర్ణభేదాలు గట్టిపడ్డ అనంతరం కూడ కొనసాగింది. ఇచట కాలభేదాన్ని దృష్టిలోవుంచుకోవాలి.

వర్ణభేదాలు చాల వదులుగ (fluid stage) వున్నదశలో సమాజంలోని మేధావి వర్గం. క్రిందివర్గాలపై పూర్తిఅధికారాన్ని చలాయించలేరు. దీన్నే ఈ రచయిత పాలక వర్గాల "ఉదారవైఖరి"అని మనకు చూపిస్తున్నాడు. ఈ ఉపనిషత్కర్తలు వర్ణభేదాలను కొంచెం ప్రక్కకునెట్టారట. ఎంతదయ! (Page 23)

తండ్రిహక్కు స్థిరపడ్డాకకూడ, స్త్రీలు ఇంక కొంత స్వేచ్ఛననుభవించేకాలంలో మేధావులకు ప్రజాసామాన్యంమీద పట్టుదొరకలేదు. దీనికి రాజకీయ అస్థిరత్వంకూడ ఒక కారణం. ఎవడు రాజైతే, వాణ్ణి ఇంద్రుడు, చంద్రుడుగ పొగిడిన మేధావివర్గం, శూద్రరాజులక్రింద కిమ్మనకుండ పూడిగంచేసిన బ్రాహ్మణవర్గంలోని వుదారవైఖరిని. ఈ రచయిత వారి మంచితనంకింద చూపించటం, వారిని పొగడటమే ఔతుంది. దీన్నే వర్గఐక్యత అంటాం.

వర్ణభేదాలు వుపనిషత్కర్తల సృష్టియైనట్లు మనకు బోధిస్తున్నారు. లేనియెడల ఉపనిషత్తుల రచయితలు, వర్ణభేదాలను ప్రక్కకు నెట్టటమేమిటి? మేధావులు ముందా? వర్ణభేదాలు ముందా? చెట్టు ముందా, విత్తు ముందా అని చర్చించుకుంటు విశ్రాంతిగ కూర్చొనగల బ్రాహ్మణవర్గం, కొన్ని తెగల్లోనైనా, వర్ణభేదాలు గట్టిపడకముందుండుట సాధ్యంకాదు.

సమాజం మార్పు చెందుతున్నదశలో, అస్థిర సాంఘిక స్థితిగతుల ప్రతిబింబమే ఉపనిషత్తులు. వీటిని మనం, నాటి సామాజిక భౌతిక పరిస్థితులనుండి పుట్టిన, మానసిక ఊహాజనిత ప్రతిబింబాలుగ చూడాలి.

ఉపనిషత్తులు ఒక కాలానికిగాని లేక ఒక స్థలానికిగాని చెందినవికావు. ఏదోఒక కోవకు చెందినవికూడకావు. ఒక పద్ధతి కాదు. ఒక భావం కాదు. భూమి. ఆకాశం మధ్యలో, ఆనాటి గ్రంధకర్తలకు తోచిన సర్వవిషయాలను చర్చించారు. వాటినుండి, నేడు యెవరికేదికావాలో అది తీసుకోవచ్చును, భిన్నధోరణులు, భిన్నదృక్పథాలతో కూడిన ఆలోచనలు వీటినుండి వెదికి తీయవచ్చు. ప్రయోజనం చూపవచ్చు. నష్టం చూపవచ్చు. సామ్యాలు కావాలన్నా దొరుకుతాయి. వైరుధ్యాలు కావాలన్నా దొరుకుతాయి. అందుచేత వీటిని 'సర్వసార సంగ్రహం' అంటానికి వీల్లేదు, వివిధభావాల 'మ్యూజియం' అనవచ్చు. ఇవి పూర్తిగ పాలకవర్గాల భావాలుమాత్రమే.

ఇంతగొప్ప మ్యూజియంనుండి, ఈ రచయిత, ఏ వర్గపుభావాలను మనకు ఎత్తి చూపించాడు. ఇది యాదృచ్ఛికమా? లేక వర్గఐక్యతా? పాలకవర్గాలను బహిరంగంగా మెచ్చుకునే ధైర్యంలేక భావవాదానికొక సాంఘికప్రయోజనాన్ని చూపించేవారినిగురించి లెనిన్ అభిప్రాయం ఇది—

“మతాలు సంఘానికిచేసే అపకారానికి హద్దులున్నాయి. కాని భావవాదం, ఒక విజ్ఞానశాస్త్రంగ పోజుపెట్టి, మానవుని తార్కికజ్ఞానాన్ని పూర్తిగ దారిమళ్ళించి, సర్వనాశనానికి కారణభూతమౌతుంది.”

ఉన్నతమైన, ఉపనిషత్తుల భావవాదానికిది చక్కగ సరిపోతుంది. భారతప్రజలకు ఏ విదేశీయులు చేయలేనంత హెచ్చు అపకారాన్ని ఉపనిషత్తుల భావవాదంచేసింది- అని ఖండితంగ రుజువుచేయవచ్చు.

## సమాజము - వ్యక్తి (కొత్తమానవ మతం)

ఈ భారతీయ తత్వశాస్త్రరచయిత, ఈ పుస్తకంలో ఒక కొత్తమతాన్ని స్థాపించాలని చెప్పలేదు. కాని ప్రతి మతంపై ఆయన వ్యాఖ్యలు, అధునాతనకాలానికనుగుణంగ పరిపడగల ఒక కొత్తమతం కావాలని కోరుతున్నట్లు స్పష్టపడుతోంది,

అమాటకొస్తే, పాతమత ప్రవక్తలెవరు, నేనీమతం స్థాపించబోతున్నాననిచెప్పలేదు. ఆయాకాలాల్లో, అవసరం అని తాము నమ్మిన కొన్ని నీతిసూత్రాలను ప్రచారంలోపెట్టారు. ఆ సూత్రాలు యే వర్గానికుపయోగపడ్డాయో, ఆ వర్గం ముందుకొచ్చి, వాటిని స్వీకరించి, ప్రోత్సహించి, అభివృద్ధిలోకి తెచ్చింది. బ్రాహ్మణమతాన్ని భూస్వామ్యవర్గం, బౌద్ధమతాన్ని వ్యాపారవర్గం, అద్వైతమతాన్ని ఫ్యూడల్‌వర్గాలు బలపర్చి ప్రచారంచేశాయి.

ఐతే, ఈరచయిత, పాతమతప్రవక్తలంతసూటిగకూడ చెప్పలేక, 'పాజిటివిష్టు' ధోరణిలో చెప్పాడు. అంటే భారతీయ భావవాదంతో వాదిస్తూ, దాన్నే తిరిగి కొత్త రూపంలో చెప్పాడు. ఈ పుస్తకంలో ఎచటకూడ భావవాదంతో పోట్లాడలేదు, మాట్లాడాడు. అంతే.

అద్వైతాన్ని, అరవిందుణ్ణి, గౌతమబుద్ధుణ్ణి, భగవద్గీతను, గాంధిని ఇదేవిధంగ బలపర్చాడు. అలా బలపర్చ వీలుపడనిచోట్ల, అర్థాలు మార్చి ఆ పాతమతాలను ఆదర్శవంతంగ చేయ సాహసించాడు. ప్రవక్తలకు మహనీయతలు ప్రసాదించాడు.

"మతవిశ్వాసాలు అశాస్త్రీయం ఐనప్పటికీ, భక్తిధోరణులు, వ్యక్తి తన ఔన్నత్యాన్ని, నిగ్రహాన్ని, సమబుద్ధిని ఎలా పెంచుకోవాలో అతి ప్రతిభావంతంగ నిరూపించాయి. బోధచేశాయి" అన్నాడు. (పే. 181)

"భగవద్గీతకు జ్ఞానేశ్వర్ వ్రాసిన వ్యాఖ్య భక్తిప్రధానమై, మహారాష్ట్రలో గొప్ప సత్ప్రభావాన్ని కల్గించింది" అన్నాడు. (పే. 182)

"వైష్ణవభక్తినుండి, శిథిలజీర్ణధోరణులు మాత్రమేకాక ఆరోగ్యకరమైన సంస్కరణధోరణులుకూడ తలఎత్తినవి." (పే. 192)

"బౌద్ధమతం భారతజాతికి మహోపకారంచేసింది." (పే. 70)

ఈవిధంగ మతాలయెడ తన భక్తిని ఈ రచయిత ప్రకటించటంతో ఆగలేదు. భగవద్గీత శాస్త్రీయదృష్టితోకూడినదని, అటు వ్యక్తి స్వేచ్ఛకు, ఇటు సమాజశ్రేయస్సుకు వుపయోగపడగల 'నిష్కామకర్మ' అందరు ఆచరించాలని ప్రబోధించాడు. ఇదిఅన్ని కులాలకు, అన్నివర్గాలకు సరిపడగల సరైనమార్గమన్నాడు దీనికి ఋజువుగ దీన్ని విదేశీయులుసైతం పరిశీలిస్తున్నారట. అది మామూలు ఒట్టి పుస్తకంమాత్రమేకాదని హెచ్చరించాడు. 'భగవద్గీత ప్రతి ఒక్కరి ఔన్నత్యానికి అవసరమైంది.' (పే. 183) నీకు యుక్తమైనదేదో చెయ్యి అన్న వాక్కు ప్రతివ్యక్తికీ వర్తించేసందేశం. (పే. 186)

ఉత్తరహిందూస్తాన్‌లో తులసీదాసు రామాయణం ప్రజలలో మంచిలక్షణాల పెరిగాదానికి యెంతగానో ఉపకరించింది. (పే. 165) మతాలు, వ్యక్తులయెడ ఇదే ధోరణిలో పాతభౌతికవాదాన్ని, ఆఖరుకు మావో గతితార్కిక భౌతికవాదాన్నిసైతం, భావవాదం సరసకు దిగలాగటం ఈ పుస్తకంలో గమనించవచ్చు. క్రిందిభాగాలు చదవండి.

"మానవుడు దేవునిచేతిలో కీలుబొమ్మ అని భావవాది అనగా, 'నియతి'చేతిలో కీలుబొమ్మఅని చార్వాక భౌతికవాది అన్నాడు. అంతే లేదా. పైపెచ్చు ఈ భౌతికవాద ధోరణులు కాలక్రమేణ వ్యక్తిగత అరాచకత్వాన్ని సమర్థించేవిగ తయారైనాయి (పే.62) ఈ భౌతికవాదుల జడాత్మకదృష్టిని గౌతముడు ఖండించి, అభ్యుదయకర ధోరణిని ప్రవేశపెట్టాడు," (పే. 62) అంటున్నాడు, అంటే భావవాదం భౌతికవాదం ఒకటేనంటాడు.

"ప్రత్యేకధర్మం; సామాన్య ధర్మంగురించి, వైశేషికులు చెప్పిన విషయాలనే ఆధునిక గతితర్కంకూడ చెబుతోంది"అని మావోవైరుధ్యాలు పుస్తకంనుండి చూపించాడు. (పే.128)

ఈ విధంగ చార్వాకుల భౌతికవాదాన్ని, ఆధునిక గతితార్కిక భౌతికవాదాన్ని, నీచస్వార్థ భావవాదం సరసకు దిగజార్చటంలో ఈ రచయిత ఉద్దేశ్యమేమిటి? పాత భావవాదాన్నిమార్చి, అధునాతన భావవాదాన్ని సృష్టించ బూనుకోవడమే. దీన్నెలా సాధించబూనుకున్నాడు?

వ్యక్తి పూజావిధానంద్వారా సమాజాతీతవ్యక్తుల్ని సృష్టిచేయుటద్వారా— "ఒకపుడు వ్యక్తిప్రధాన ధోరణులు సమాజంలో అభ్యుదయకరపాత్ర వహించాయి." (పే,222) "ప్రతిఒక్క మతమూ తత్వశాస్త్రమూ వ్యక్తిఔన్నత్యానికి మార్గం సూచిస్తూనేవున్నాయి.

ఈ మార్గాలన్నిటిలోకి గీతా మార్గం, ఆధునిక భావాలకు సైతం ఇమడగల విశాల ప్రాతిపదిక కలది". (పే. 186) అంటూ వ్యక్తి చైతన్యంలో దైవత్వాన్ని చూపిస్తున్నాడు.

"పరిణామం ఇంతటితో ఆగుతుందా? ఆగదు.

"ఇకముందు జరిగే పరిణామంపై, మానవ చైతన్య ప్రభావం వుంటుందా? ఉంటుంది. ఈ రెండు అంశాలలోను అరవిందుని భావాలు సరైనవే.... సమాజ పరిస్థితులెలావున్నా, కొందరువ్యక్తులు శమదమాది సద్గుణాలను సమబుద్ధిని పెంపుచేసుకొని అజాతశత్రువులవలె జీవించలేరా? జీవించగలరు. అట్టివారిని మాటవరసకు అతీత మానవులన్నా అభ్యంతరంలేదు కాని అదేమార్గాన సమాజమంతా అభ్యున్నతి పొందజాలదు" (పే. 207)

ఇచట రచయిత, వ్యక్తి ఔన్నత్యాన్ని, వ్యక్తి స్వేచ్ఛను సంఘాన్నుండి విడదీసి మాట్లాడుతున్నాడు. బుద్ధునిలోమహనీయత, తిలక్‌లో కర్మయోగత్వం, గాంధీలో అహింసా గొప్పతనం, భగవద్గీతలో పవిత్రత (అది ఒట్టి నిర్జీవ గ్రంధంకాదంటాడు) మనకు చూపిస్తున్నాడు. ఈ వ్యక్తి పూజ మార్క్సిజం. లెనినిజానికి వ్యతిరేకదృష్టి. గతంలో జర్మన్ తత్వవేత్త 'ఫ్యూయర్‌బాహ' ఇదే విధమైన అభిప్రాయాలు వెలిబుచ్చినందుకు మార్క్సుఏంగిల్సుల విమర్శకుగురైనాడు. దీన్ని ఏంగిల్సు ఈ విధంగచెప్పాడు. "మతాలుముందుకు నడవలేక ఆగిపోయినపుడు మానవుని 'చైతన్యం' ముందుకొస్తుంది. ఇది ఉత్తమోత్తమమైన దైవస్వరూపం. ఏ దేవుడు దీనికి సాటిరాడు."

మాటవరసకైనా కొందరు వ్యక్తులు అజాత శత్రువులవలె, అతీతమానవులుగ జీవించగలరనీ ఈ రచయితవాదన 'భావవాదంయొక్క ఉన్నతదశ'. ఎందుకని?

'సాంఘిక 'స్థితి' ననుసరించే సాంఘిక చైతన్యం అంటే ఒకకాలపు ప్రజలు తమ తిండి, గుడ్డ, ఇల్లు మొదలగు భౌతికావసరాల కొరకుచేసే కృషిననుసరించేవారి చైతన్యం వుంటుంది. ఈ సమాజమే వ్యక్తుల్ని తీర్చి దిద్దుతుంది. వ్యక్తి సమాజంపై తన ప్రభావాన్ని ప్రసరింపచేసేముందు, ఆ కాలపు సామాజిక సూత్రాలకతీతంగ వుండజాలడు, ఐతే 'నాయకుడు' లేక గొప్ప వ్యక్తి అంటే అతనికాలపు సమాజంలో ఎవరు చేయలేని పనులను చేసినందువల్లకాదు. ఇతరులకంటె ముందుగాను, మంచిగాను చేసినందువల్ల అతడిని ప్రజలు తమ నాయకుడుగ గుర్తిస్తారు. అంత మాత్రాన అతణ్ణి సమాజాతీత మానవుడుగానో, విశ్వమానవుడుగానో ఆ కాలనికి ముందున్న మానవుడుగానో చిత్రించి మహాత్ముణ్ణిచేసి చూపించటం ఒక కొత్త మతాన్ని స్థాపించబూనటమే ఔతుంది. సమాజపరిస్థితులెలావున్నా, కొందరు వ్యక్తులు కొన్ని తరాలుముందు చూడ

గలరట. గౌతమబుద్ధుడు కమ్యూనిస్టు సమాజంవరకు చూడగగ్లాడట. ఈ ధోరణిని ఏమనాలి?

ఈ 'పాజిటివిస్టు' కులభేదాల నెంతచక్కగ సమర్థిస్తున్నాడో గమనించండి. "చాతుర్ వర్ణం మయాంసృష్టం"అని ఖండితంగ, సూటిగ చెప్పిన భగవద్గీతనుగురించి ఇలా అన్నాడు. "కులవ్యవస్థ విషయంలో గీత రాజీపద్ధతి అవలంభించింది. కుల భేదాలను గుర్తించింది. ఐతే కులద్వేషాలుకూడదని మాత్రం అన్నది. క్రింది స్థాయి వ్యక్తి పైస్థాయికి రావాలనే అంశం గీతలో కీలకం. కులాలు శాశ్వతమైనవి, మార్చరానివి అనే భావానికి గీత వ్యతిరేకం."

'బ్రాహ్మణులొస్తున్నారు తప్పుకోండి' అంటూ హెచ్చరికలులేకుండ ముందుకు అడుగుపేయని శంకరుడు కులభేదాలను కొంతవరకు పాటించవలసి వుంటుందన్నాడట.

క్షత్రియ, బ్రాహ్మణ, వైశ్య, శూద్ర కులాల వరుసను సమర్థించిన గౌతమ బుద్ధుడు మానవులందరు సమానం అన్నాడని, వర్ణభేదాలు తగవు అన్నాడని ప్రచారం చేస్తున్నాడీ రచయిత.

ఉపనిషత్తులు ప్రారంభంకాలానికి కులభేదాలింకగట్టిపడలేదు. వాటిని ఖచ్చితంగ అమలుజరిపించాలని రాజులపై వత్తిడితెచ్చిన ఉపనిషత్తులను, కులభేదాలను కొంచెం ప్రక్కకునెట్టారని అందరిలోని ఆత్మసమానంగనుక మానవులందరు సమానమని అవి భోధించినట్లు చిత్రించాడు.

ఈ రచయిత మతాలను, కులాలను సమర్థించినట్లు ఈవిషయాలు మనకు రుజువు చేస్తున్నాయి. ఇక యీ కొత్త మతానికీ రచయిత కోరుతున్న దేవుడెలాంటివాడు, ఏంగెల్సు చెప్పినట్లుగ జనంకోరే దేవుణ్ని వదిలేసి దేవుడంటే జనానికుండే అభిప్రాయాన్ని తీసుకున్నాడు.

భగవంతునిలోని సర్వజ్ఞతను ఒక వ్యక్తికోపెట్టి, భగవద్గీతలోనుండి తనదేవుణ్ణి మనకు చూపిస్తున్నాడు.

"దుఃఖంవస్తే శోకించడు. సుఖంకలిగితే సమ్మోహం పొందడు, అనురాగ, భయ, క్రోధాలులేక అందరిపట్లా సమభావం ప్రదర్శిస్తాడు. అతడు ముని. స్థితప్రజ్ఞుడు." ప్రపంచమంతా నిద్రిస్తున్నపుడు మేల్కొని వుంటాడు. ప్రపంచమంతా మేల్కొన్నపుడు అతడు నిద్రలోవుంటాడు. (పే. 182)

అధునాతనకాలానికవసరమైన విధంగ కనిపెట్టబడ్డ ఈ దేవుడు, నిజానికి ఆము దపుదీపాల సంస్కృతికి చెందినవాడు, ఇదేరకమైన 'జితేంద్రియు' డనే దేవుణ్ని. మనువు తన ధర్మశాస్త్రం 2 వ అధ్యాయం 98 శ్లోకంలో లోకానికి పరిచయం చేశాడు.

"దూషణ భూషణాదులను సమానంగాను, మెత్తదనాన్ని, గట్టిదనాన్ని, కురూపిని, సురూపిని, మధురాహారాన్ని, చేదును, సువాసనను దుర్వాసనను, సంతోషంలోను కష్టం లోను సమానంగ యెవడుండగలడో వాడే 'జితేంద్రియుడు."

మనువు కాలాన్నుండి ఈరోజువరకు యెవరులేరు. వుంటే అతడు సమాజమనే గర్భగుడిలోని రాతిబొమ్మమాత్రమే ఔతాడు. అతీతమానవుడు అంటే యిదే.

ఈ 'జితేంద్రియుడు' వురఫ్ 'స్థితప్రజ్ఞుడు' సంఘంలోపుట్టి,సంఘంలో పెరుగుతాడా? సాంఘికాచరణ ఏమైనా వుంటుందా? లేక గౌతమబుద్ధునిలాగ సంఘంబయట తయారు తిని ఏదో మంచిరోజున హఠాత్తుగ సమాజంలో చొరబడి తన చైతన్యాన్ని ప్రభవింపచేస్తాడా? దీనికీరచయిత జవాబులోనే అతని ఓటమిని గమనించవచ్చు.

"బుద్ధుడు, ఏసుక్రీస్తుకాలంనుండి ఎందరో ప్రవక్తలు, మహనీయులుపుట్టారు, గిట్టారు. వారి బోధలు నిరుపయోగమైనవనికాదు. కొంత వుపయోగం కల్గించాయి. కాని బలవత్తరమైన సాంఘికశక్తుల ప్రభావంతో వారి బోధలు వక్రీకరించాయి. నిష్ఫలమయ్యాయి." (పే. 207) సమాజపరిస్థితులెలావున్నా కొందరు వ్యక్తులు అతీతమానవులుగా అజాతశత్రువులవలె జీవించగలరు' కాని అదేమార్గాన సమాజమంతా అభ్యున్నతి పొందజాలదు. (పే. 207)

మరి పైనచెప్పిన భవిష్యత్తులో పరిణామంపై మానవ చైతన్య పరిభావముంటుందనే సమర్ధనలో అర్ధమేమిటో ఈ రచయితే సమాధానమీయాల్సివుంది–

---



---

# శ్మశాన శాంతి

కాళీపట్నం రామారావు కథలు— సాగర గ్రంథమాల, విశాఖపట్నం-2.
వెల: రూ. 2-50

ఆధునిక కథాసాహిత్యానికి రాచకొండ విశ్వనాథశాస్త్రి ఒక కోపు, కాళీపట్నం రామారావు మరొకకోపూ కాస్తున్నారంటే అది అతిశయోక్తి కాదు. ఇద్దరూ 'అట్టడుగు' వాళ్ళను గురించి రాయగలరు; వాళ్లదృక్పథాన్ని చైతన్యవంతంగా చిత్రించగలరు.

మధ్యతరగతికిచెందిన కథకులు మధ్యతరగతి జీవితంగురించే అభూతకల్పనలు చేసి ''కీర్తి'' గడిస్తున్న ఈ కాలంలో, రామారావులాగా అధోగతిజీవితాన్ని వాస్తవంగా చిత్రించటం అపూర్వమనాలి.

"నాకథలు పొడుగ్గా వుంటాయనీ, అవి చదువుకోవటానికి హాయిగా నడవ్వనీ కొందరు మిత్రులు చెబుతూవుంటారు...అయినా కొన్ని కథలు పొడుగ్గానే తప్ప రాయలేకపోయాను" అంటారు రామారావు "సంజాయిషీ"లో.

చిన్నకథకు శిల్పం శాసించటం అవివేకమనీ, దాని వైవిధ్యానికి అంతులేదనీ పాశ్చాత్య విమర్శకులు ఏనాడో ఒప్పుకున్నారు. అయితే చిన్నకథ స్వరూపం యిలా ఉండాలన్నభావం కొందరిలో కలగటానికి కారణం సాధారణంగా దానికిఉండే మధ్యతరగతి స్వభావం. "సరదా"కు చదివే కథలు అట్టేసేపు పట్టకూడదు. మతాబా వెలిగినట్టు వెలిగి ఆరిపోవాలి, కాస్సేపు నేత్రపర్వంచేసి తప్పుకోవాలి. కాని రామారావు కథలు మతాబాలుకావు. హాండ్‌గ్రెనేడ్‌లు. అవి పేలి, వాటి శకలాలు చుట్టూ చాలాదూరం ధ్వంసంచేస్తాయి.

కథలు చెప్పటంలో ఒక్కొక్కప్పుడు రామారావుది పురాణ పద్ధతి. భారతంలో భీష్ముడు దుర్యోధనుణ్ణి ఘోషయాత్ర వెళ్ళవద్దని ఒక్క ముక్క చెప్పి ఆగిపోడు; ఆ సందర్భాన్ని పురస్కరించుకుని కొన్ని పేజీలు మాట్లాడతాడు. అది ఇవాళమనకు బోరు కొట్టొచ్చు కాని భీష్ముడి సలహాకన్న ఆ ప్రసంగమే పఠితకు ముఖ్యమని పౌరాణికుడి అభిప్రాయం. అసలైన జీవితసత్యాలు అందులోనే ఉన్నాయి. గోర్కీరాసిన 'అమ్మ'ను ఒక పాఠ్యగ్రంథంగా ఒక మిత్రుడు పేర్కొన్నాడు. ఈపుస్తకంలోని "శాంతి" ఒక పాఠ్యకథఅని నేను పేర్కొంటాను.

"శాంతి"కథను కావాలంటే మూడుపేజీలలో చెప్పొచ్చు. కాని ఆ మూడుపేజీల కథ ఎవరైనా రాయొచ్చు. దానికి విశిష్టత ఏమీ వుండదు. అందులోని ఆర్థిక-సాంఘిక రాజకీయ సత్యాలే ఆ కథకు ఆయువుపట్టు.

కథపేరు "శాంతి". ఈశాంతిని గురించి ఈకథ ఏమంటుంది?

"శాంతి అహింసఅనే పదాలను గందరగోళంచేస్తున్నారు.(చాలామంది)గాంధీ గారి (అహింస) ఉద్యమంవల్లకూడా దేశంలో టోలెడు అలజడి లేచింది.... మార్పు ఎప్పుడూ శాంతిమార్గాన వచ్చే అవకాశంలేదు.

"కొట్టేచేతిని పట్టుకోడము, తిట్టేనోటికెదురుతిరగడంకూడా శాంతికి భంగకరా లంటారు (చాలామంది) క్రూరమృగం నిన్ను పట్టుకుతింటోంది. కదిలితే కల్లోలంతప్పదు కదా, కదలకుండా భోంచెయ్యనియ్ అదేనా నువుకోరేశాంతి? బాకో, చాకో చూపి దోపిడిదొంగ నిన్ను దోస్తాడు. తిరగబడితే రక్తపాతం తప్పదు. అంచేత కిక్కురు మనకు- అదేనా నువ్‌చెప్పే శాంతివాదమంటాడు(కవి)."

జీవితం నిలవఉండదు. (నిలవున్న పెరుగు పులుస్తుంది, పురుగులు పడుతుంది. జీవితంమాట వేరేచెప్పాలా?) మార్పు మంచికిజరిగినా, చెడుకుజరిగినా ఘర్షణతప్పదు.

అయితే మరి శాంతినినాదం ఎవరిది? "స్వేచ్ఛగా మసలడానికోయిల్లూ, కడుపు నిండా తినేందుకు తిండీ, కట్టేందుకు ఖరీదైనగుడ్డా అందినవాళ్ళందరికీ శాంతికావాలి."

మరి శాంతికి నిర్వచనం? "న్యాయమైన కోరికలు మేం (కార్మికులు) ఒదులు కోప్పోతే శాంతికి భంగం కలుగుతుంది. తీర్చవలసినకోరికలు వారు (యజమానులు) తీర్చపోతే శాంతికి భంగంకాదు. శాంతియుతమైన సంప్రదింపుల్లో యింతకాలంవూ వారు మొరాయించింది అశాంతికి దారితీసేదికాదు. చట్టసమ్మతంగా మేం రేపు సమ్మె చేయబోతే అది అశాంతికి దారితీస్తుంది. ఆనిప్పురవ్వతో దేశమంతా మండిపోతుంది."

దేశమంతా మండించడానికి పనివాడిచేతిలోఉన్న ఆయుధం ఏమిటి? దానిపట్ల యజమానులవైఖరి ఏమిటి?

"యజమానులకుండే అంగబలం, అర్థబలంతో వాళ్ల కొనగల కోర్టుల్నీ, పోలీసుల్నీ, జైళ్లనూ వాళ్ళ రక్షణకిచ్చింది యీ దేశంలోవున్న వ్యవస్థ. ఏమీలేని పనివాడి చేతిలో ఒకేహక్కు— సమ్మెచేసే హక్కు— మిగిల్చింది రాజ్యాంగం. ఆ సమ్మెచేసే హక్కును ఈయనగారు(యజమాని)లాకట్టుకోరేపద్ధతి— దొంగకావలివాణ్ణి, 'నీ కర్రి యిచ్చెయ్, నీతోటలో కోసుకున్న పళ్లు నీకు పెడతాననడం.'"

ఇంతకీ ప్రభుత్వం అవలంబించే అహింస ఎలాటిది?

"స్వతంత్రించవచ్చేక ఎన్నో చిన్నచిన్న ఉద్యమాలు నడిచేయి- భాషారాష్ట్రోద్యమాలు విద్యార్థుల అలజళ్లు, అధికారుల దౌర్జన్యాలకు నిరసనగా- పెరిగేధరలకు వ్యతిరేకంగా ప్రజలతో ఉద్యోగులతోనడిపినవి, ఉక్కు ఉద్యమం, హిందీ వ్యతిరేకోద్యమం వంటివి. ఇవేవీ వ్యవస్థలు మార్చటానికికాదు ప్రభుత్వాలను కూలదోయటానికీకాదు. (ప్రాంతీయ ప్రభుత్వాలను విజయవంతంగా కూలదోసే ఉద్యమాలు నడపటం పాలకవర్గం గుత్తహక్కు).- ఎంతకూ ప్రజలగోడు వినిపించుకోని నాయకుల ఉదాసీనతకు అలిగి, నిరసనగా నడిచినవి. అలాంటివాటిని సహితం మాటిమాటికీ అహింసా మంత్రాన్ని జపించే నాయకులు, శాంతిసమరాల్లో కాకలుతీరిన రాజకీయయోధులు ఏపద్ధతిలో యెదుర్కొన్నారు?" యీ ఉద్యమాలలో నిరాయుధులు ఎంతమంది బలిఅయారన్నది ఈ దేశంలో ప్రతి పిల్లవాడికీ చెప్పవలసినసంగతి.

ఇదేవైఖరి సమ్మెలనుగురించి– రాజ్యాంగం ఒప్పుకునేవాటినిగురించిసైతంఉన్నది. "సమ్మెచేస్తామన్నామే కాని యజమాని తలకొట్టి మిల్లుగుమ్మానికి వేలకడతామనలేదు. అయినా మేం అంతమాట అనేసినట్టు గొడవజరుగుతోంది."

ఈ అధ్వాన్న పరిస్థితికి మూలకారణం ఏమిటి? కలెక్టరురావు అంటాడు.

"దేశంకోసం, జనంకోసం ఏదేనా చెయ్యవచ్చుననే వుద్దేశ్యంతో నేనిందులో కొచ్చేను (ఉద్యోగంలోకి). కాని అధికారానికీ స్వేచ్ఛకీ ఎన్నిపరిమితులున్నాయో ఇందులోకొచ్చేకే తెలిసింది." అంటూ ఆయన యీ దేశంలో రాజకీయనాయకులుగా చలామణిఅయేవారు ఎంత అజ్ఞానులో విడమర్చిచెప్పేరు. "కనీసం ఎకనమిక్స్, హిస్టరీ, జాగ్రఫీలలోనైనా మన రాజకీయ నాయకులకు ఓనమాలు తెలియవు. ఆ అజ్ఞానంలోనే వాళ్లు దేశానికి సంబంధించిన పెద్ద పెద్ద విషయాలమీద అభిప్రాయాలు ప్రకటిస్తారు. శాసనాలు చేస్తారు. పరిపాలనావ్యవహారాల్లో అడుగడుగునా అడ్డుతగుల్తారు.... రాజకీయాలపట్ల ఆసక్తివున్నవాళ్లూ, నిస్వార్థంగా జనంకోసం పనిచేయగల విద్యావంతులూ వుద్యోగాలే చేస్తూంటారు. ఏ ఉద్యోగాలకీ అర్హతలేనివాళ్లూ, స్వార్థం తప్ప యింకే ప్రేరణలేనివాళ్లూ మాత్రమే రాజకీయాల్లో చేరుతున్నారు దేశంలో అన్నవస్త్రాలకరువుంది, అది ఘోరమైందే. కాని అంతకన్నా ఘోరమైంది- అటు ప్రజలగ్గాని, ఇటు ప్రభుత్వానిగ్గాని శాస్త్రీయజ్ఞానంపట్ల విజ్ఞానులపట్ల ఆసక్తి, గౌరవం లేకపోవడం "

ఇది పాక్షికసత్యం మాత్రమే. కలెక్టరుగారు "నడుమ సిరివచ్చి కలసిన పాడుబుద్ధు"లనుమాత్రమే విశ్లేషించారు. కాని వీళ్ళకు సిరి కట్టబెట్టినవాళ్ల శిఖరాసనఉన్నారు.

కలెక్టరుగారి మాటలు వాళ్ళకు వర్తించవు. వాళ్లు బఫూన్‌లు కారు, మూఢులు కారు, శాస్త్రజ్ఞానం విలువతెలియనివాళ్లూ కారు. వాళ్లు తమ పథకాలను అమలుపరుచుకునే టందుకు ఏయే పెడగు బుద్ధులను ఎక్కడెక్కడ ఉంచాలో, శాస్త్రజ్ఞానాన్ని ఎంతవరకు ముందుకునడిపించాలో, పేదజనాన్ని హింసాయుత జీవితానికి ఎలా అంటిపెట్టిఉంచాలో బాగా అంచనాకట్టగలవాళ్లే. అందుచేత అసలు రాజకీయ సామాజికసమస్య ఒకటే.

ఈ కథలో ఇంకా చాలా పరమసత్యాలున్నాయి. మచ్చుకి— పెట్టుబడిదారు దృక్పథం :

"దొంగిలించేదానికన్నా దోచితే చిక్కేది ఎక్కువ." నిరపాయంకూడా.

"పోటీ తలెత్తకముందే నుప్ పెరిగిపోవాలి."

పెట్టుబడిదారు దేశంకోసం ఏదోచేస్తున్నాడనీ, దేశంకోసం దివాలాఎత్తిపోయే పరిస్థితిలో తనను తాను పెట్టుకుంటున్నాడనీ ఒక వాదనవుండేది. ఇది పెద్దపెట్టుబడి దార్లకు వర్తించదన్నవిషయం నేను నా అనుభవంలో చాలాసార్లుచూశాను. ఈవిషయం ఇందులోకూడా ఉన్నది.

"లోగడ మేనేజ్‌మెంట్ ఎంత అవకతవకగా నడిపినా అది(పరిశ్రమ)బతికి బట్ట కట్టింది."

పెట్టుబడిదారుకూ కష్టాలు లేకపోలేదు.

"(పెట్టుబడిదారుపట్టాభి) నాయకుల్నీ, ప్రభుత్వాన్నీ అదరగొట్టగలిగేడు. తన చేతికింది పనివాళ్లనుమాత్రం చేతికిందకు తేలేకపోయాడు." కారణం వాళ్ళ నాయకుడు విశ్వనాథం ఏ పార్టీకో అంటిపెట్టుకున్నవాడైనా అంత ఇబ్బందిలేకపోను, ఏబంధనాలు లేకపోవడంవల్లా మొత్తం యూనియనంతా ఒక్కటిగా అతనివెనక ఉండడంవల్లా ఆ మనిషి...ఒంటినిపట్టిన పీడలా వేధిస్తున్నాడు."

పెట్టుబడిదారుకు "సర్వైవల్"ముందు: దానితరవాతే సిద్ధాంతాలన్నీ." అదే పీడక వర్గం పరిస్థితిలోఉన్న పెద్ద దౌర్బల్యం. పీడితవర్గాల "సర్వైవల్" గట్టిగా సిద్ధాంతాల పునాదిమీద ఆధారపడిఉంది. అందుకే పాపం బూర్జువా డెమోక్రాట్‌లు బెదిరినప్పుడల్లా డెమోక్రసీకి తిలోదకాలిస్తారు. పుస్తకాలను నిషేధిస్తారు. నిరాయుధులమీద కాల్పులు చేయిస్తారు, వాళ్లు పైకిచెప్పే సిద్ధాంతాలు వాళ్ళని ఆదుకోవు.

ఈకథలో ఇంకా అనేకరకాల సత్యాలున్నాయి.

"బతకవలిసే జీవికి బొలారిష్టాలుచేసే మేలు ఇంతాఅంతాకాదు. లక్షతయ్యారీలూ, వాక్సీనులూ చెయ్యలేనిపని ఒక్క జబ్బు చెయ్యగల్దుగదా." ఈ మాట విద్యాధికులలో ఎందరికి తెలుసు?

"సామ్రాజ్యాలు స్థాపించడం కష్టంకాదు, ఏలడంలోఉంది అసలు కష్టం."

"కూర్చునే కొమ్మనునరికేజాతి అన్నికాలాల్లోనూ, అన్ని దేశాల్లోనూ ఉంది .. ఈదేశం ప్రత్యేకత ఏమిటంటే దానినాయకత్వానికి ఇంకోదేశంనుండి ఆదేశాలురావాలి"

"డెమోక్రటిక్ దేశాల్లో పగ్గాలన్నీ ప్రభుత్వంచేతిలోనే ఉండవుకదా? అదొక్కటే ఉన్నంతలో కొంత సుగుణం"– పెట్టుబడిదార్లకు. కాని ప్రజలు మేలుకుంటే ఈపెట్టుబడిదార్లే డెమోక్రసీకి స్వస్తిచెప్పి, ఫాసిస్టు రాక్షసత్వంనుంచి రక్షణపొందగలరు. వారి "రాజు"కు చాలా కాపులున్నాయి

"వాళ్ళ (కార్మికుల) దృష్టిలో పెట్టుబడిదారు పట్టపగలు గుట్టుచప్పుడుకాకుండా దోచే దోపిడీదొంగ, జనంతాలూకు అజ్ఞానంమీదా, ఆకలిమీదా, ఆ రెంటిదాఫా లేనివాళ్లలో తన ప్రభావంద్వారా నాటిన దురాశమీదా బతికే రాక్షసజంతువు. దాని అంట్లగిన్నెల కోసం కక్కుర్తిపడే మధ్యతరగతివండే వంటమనిషినీ, పెట్టేచేతినీ గుర్తించదు...."

ఈ సందర్భంలో చెప్పబడిన మధ్యతరగతికి సామ్యంగా ఇదే కథలో పట్టాభిగారి కుక్కలు సజెస్టుకావటం గమనార్హం. పట్టాభి కుక్కలు– కనీసం వాటిలో ఒక అల్సేషియన్– వంటమనిషినిచూసి, "తిండిపెట్టేమనిషికదా– అనుమానంవేస్తే ఆమెనుచూసి కూడా మొరుగుతుంది!"

ఒకకథలో ఇలాటివాక్యాలు "కోట్"చెయ్యటానికి ఉండటం సాధ్యమా అని కథ చదవనివారికి ఆశ్చర్యం కలగొచ్చు. ముందేచెప్పినట్లు, ఇది ఒకపాఠంలాటికథ.

"వీరుడు– మహావీరుడు" చిన్నకథ. గొప్ప నీతిగల రసవత్తరమైనకథ.

"శ్రీరామనవమి సంబరాల్లో గండిపేట రౌడీకీ అల్లిపురం వస్తాదుకీ 'టగ్ ఆఫ్ వార్' పడింది. ఇద్దరూ హోరాహోరీ కొట్టేసుకుంటున్నారు. అల్లిపురం వస్తాదు సెట్టంత మనిషి.... అడు ఒక్కొక్క గిల్లింతా యిస్తే మూడు మూడు పిల్లిమొగ్గలేస్తున్నాడు ఈ గండిపేట గుంటడు. పకీ పూరుకోడే. 'లంజకొడకా! కొడతావురా, చిన్నోణ్ణిచేసి కొడతావా? ఇడిపించటానికొచ్చి కొడతావా? నీ నెత్తురుకళ్లజూస్తాను', అంటూ మళ్లా మళ్లా పైకొస్తాడు... గొప్ప పౌరుషంలే, మనిషిసూస్తే వస్తాదులో నాలుగోవంతుకాదు. పదోవంతేనా ఉంటాడా అనిపిస్తాడు.... ఈడు ఆడితో దెబ్బలాడ్డమంటే మాటలేటి?

అందులోనూ అంతకుముందొకడితో కలబడి కొంత చిదిగున్నాడు. అయితే మనిషికా ఫైటింగ్‌స్పిరిటు వొకొక్కప్పుడిలా వొచ్చేస్తాది. ఎలాటప్పుడు? 'న్యాయం నీవక్కనుండాల, అవతలోడు ఫాలుగేమాడాలి. అదేఁవంటే, దౌర్జన్యానికి దిగాల... జనం అవతలోడిబలానికి జడిసి అన్యాయానికి నోరెత్తకుండా వున్నారని నువ్వు గ్రహించాల. ఆ జనం పిరికితనంచూసి ఆడిజులుం మరీమరీ పెరిగిపోతుండాల"....సరిగ్గా అలాటైంలో వొచ్చేడు కొత్తపేటశాండో...వచ్చి,'ఏటది?'అన్నాడు....అమాంతంఎళ్లి ఆడి కుడిచెయ్యి టక్‌ని అందుకున్నాడు ...పట్టుకున్న ఆ చెయ్యి ఎనక్కితిప్పుతూ అన్నాడు ...ఎవడితో? గండిపేట రౌడీతో, అంటే దెబ్బలుతింటున్నవాడితో. ఏఁవనీ? 'ఇంక శాంతించు.' మెలిదిప్పినచెయ్యి సరిచేసి పట్టుకుని, చెయ్యీ చెయ్యితోపాటు శవంలాంటి ఆమనిషినీ ఒక్కదుట్న యెనక్కులాగి ఒకిసురు ఇసిరేశాడు శాండో, ఆ దెబ్బకు మూడంతర్లుకొట్టి తెరిచిపెట్టిన అల్లిపురం వస్తాదు కబంధహస్తాల్లోపడ్డాడు రౌడీ... ఆడికి తగినపని చేసేనన్నట్టుగా వెనక్కితిరిగైనా చూడకుండా వెళ్ళిపోయాడు శాండో."

కథ ఇంతే. కాని ఈ కథకుసంబంధించిన విశ్లేషణా, ఒకానొక పాత్ర చిత్రిణ ఈ కథకు అసలైన ఆయువుపట్టు.

ముందు విశ్లేషణ:

"మీరు నేను తన్నుకుంటుంటే... ఇంకోడొచ్చి యింట్రఫియరవడం, అలాటప్పుడు చుట్టూవున్నజనం చూస్తూ వూరుకోడఁవా? ఆడు వొస్తాదైతే? ఆడు ఒక్కడు... జనం వందమంది. తలో చేయీ ఏసేస్తే ఏవఁవుతాడు. వస్తాదు కాదు ఆణ్ని పుట్టించిన జేజెమ్మయినా భూఁవిలోకిదిగడిపోతాడు. అదేంకాదుట, కోడిపుంజులో గొర్రెపొటేళ్లో కుమ్ముకుంటూంటే సూస్తారూ"– అలా సూస్తన్నారు జనం.

"శాండో ఎందుకీణ్ని సైడుచెయ్యలేదు? ఈళ్ళిద్దరూ అల్లిపురంవస్తాదుని కొట్టలేరనా? ఆడు ఊఁ అంటే ఆడెనకున్న శిష్యులే భక్షించేస్తారు... అయితే అంతతో పోయిందేటి? అల్లిపురంలో యింకేవస్తాదుల్లేరా?.... గొప్పకిపోయి ఆర్తజనత్రాణమూ, అండర్‌డాగ్‌పక్షమూ అన్నాడంటే అప్పుడు కొత్తపేట శాండోల్నందర్ని దింపాల ముగ్గులోకి. దింపేడో పుచ్చెలెగిరిపోతాయ్. పోలీసుకొస్తారు. ఒకటాగొడవ? రెండో వారల్దువాశే! టౌన్లో హేమాహేమీలంతా ఋన్వాల్వవాలసొస్తాది... కొత్తపేట శాండో అందుకే 'నేగ్గా' ఆ గొడవ అలాగే పీస్‌ఫుల్‌గా సెటిల్‌చేసేశాడు. (పీస్‌ఫుల్‌గా అన్న మాట లక్షలు చేస్తుంది!)

" అయితే ఇక్కడోసిన్న పోయింటుంది. అదే, ఆడిఒంటికి మొప్పంవస్తే అడుఅలాగ ఒగ్గీసునా? ఒగ్గడు, నిజవే. అప్పుడాడి పేదోళ్లనందర్నీ పిలుస్తాడు. అసలాడు పిలవక్కర్లేదు. ఆడి బస్తులు అగ్గిలో దుకేస్తారు. బిగ్ పవర్ లోఉన్న ఆకర్షణేఆది .. ఏ లెవెల్లోనైనా బిగ్గూ స్మాలూ తేడాలు వుండనే వుంటాయి

"కొత్తపేట కాండోలాజిక్కు మనకందదుగాని అందితే అదే సరైనదనిపిస్తాది. నన్నడిగితే గంజిపేట పీరుడికి అమర్యాదలా జరగవలసిందే. లేపోతేనే ప్రమాదం....అలాటోళ్లు ఏటనుకుంటారంటే, జనం సూజూస్తూ అన్నేయాలు జరగ నిస్తారా? అనుకుంటారు. అనుకుని- 'న్యాయం ధర్మం'– పెద్దపెద్ద కబుర్లతో చిక్కుల్లో పడతారు. పడి 'సైసీనులు సృష్టిస్తారు'.

ఇలా విశ్లేషణంచేసిన పాత్ర అన్నిటికన్నా కథకు ముఖ్యమైనది ఇతగాడే కథ చేప్పేవాడుకూడా. కొట్లాటజరిగేచోట చేరిన జనం గురించి చెబుతూ, "ఆళ్లమద్దె నేనే కసింత నదరైన మనిషిని" అని చెప్పుకుంటాడు. విషయమంతా తెలుసుకున్నాక "సెప్పొద్దూనాకు మాచెడ్డకోపం వచ్చింది. తంతున్నవాడిమీదకాదు- తాపులు తింటున్న వాడిమీదకాదు చూస్తున్న జనంమీద.... చెప్పకేవీ, ఆడి (గండిపేట రౌడీ) పౌరుషం తల్చుకుంటే నాకిప్పటికీ ఒళ్లు జల్దరిస్తది. గొప్ప పౌరుషంలే .. ఒక్కొక్కసారి (చూస్తున్నంత సేపూ కాదు!) ఏఁవనిపించీది తెలుసా ఏఁవైతదైంది ఎళ్లి నేనూ వస్తాదు గాడిమీద కలియ్బడిపోదునా అనుకునేవాణ్ణి. కాని కుదఁదు. ఏంచేత? ఏసుకున్న 'టెర్లిన్ బట్టలు సిరిగిపోతాయ్. ఎన్నడూ దెబ్బలాడి నోళ్లంకాం. ఆడుసూడబోతే వస్తాదు. దెబ్బలాడ్డమే ఆడి బిజినెస్సు. సుఖాన్నున్న పాణం దుఃఖాన పెట్టుకోడం తప్ప లాభవేటీ'.

ఈ పాత్రకుండే అంతరాత్మను మెత్తని రబ్బరుతోచేశారు. అందరూ దెబ్బలు తిన్నవాణ్ణి తంతుంటే, "ఆడిమంచి కోరేనేనూ ఆడి మీద ఓ చెయ్యేసేసేను" అని కథ ముగిస్తాడు.

వీణ్ణి నీచుడంటామా? అమెరికావాళ్లు వియత్నాంలోచేసే పైశాచిక కృత్యాలను సమర్థించే మన ఘరానా మనుషులకంటె వీడు నీచుడా?

ఇటువంటి కథను కాళీపట్నం రామారావే రాయాలి.

"కళ అనేది మానవ స్వభావం" అనిబర్క్ నిర్వచించాడట.

రామారావు కళ అయినాస్వభాన్ని చిత్రించే విధానాన్నిబట్టి ఆయన స్వభావాన్ని గ్రహించవచ్చు. రామారావులో వెన్నలాటి మృదుత్వమూ, కార్చిచ్చులాటి తీవ్రతా

దారిపకంలాగా అతిసూక్ష్మమైన జాగాలలో పరివేశించేశక్తీ ఉన్నాయి. ఈ గుణాలన్నీ "చావు" కథలో స్పష్టంగా కనిపిస్తాయి

ఈ "చావు" కథ జీవంతో తొణికిసలాడుతుంది. మధ్యతరగతికి సంబంధించిన జీవంకాదు, మాలపేటకు సంబంధించినజీవం. ఎన్నిసార్లయినా చదవబుద్ధిపుట్టే ఈ కథ నాకు చాలా విషయాలు స్ఫురింపజేసింది.

మధ్యతరగతి రచయిత ఇలాంటి కథను ఇంత "ఇంటిమేట్"గా రాయటం ఎలాసాధ్యం?

మాలపేటలో పుట్టిపెరిగినవాడికి ఈ కథలోని విషయాలు తెలిసిఉండవచ్చు— కాని ఆ విషయాలను రాయగలగటం అంతగాసాధ్యంకాదు.

అట్టడుగు జీవితం గురించి రాయాలని విరసం కథకులు నిర్ణయాలు చేస్తున్నారు. రాయటానికి ప్రయత్నిస్తున్నారు. అట్టడుగు జీవితం గురించి రాసిన మాత్రాన అది పాఠకుడి అనుభూతి అయిపోయేటట్టు చెయ్యటం సాధ్యమా? ఈ కథ ఆపని చేస్తున్నది. పుస్తకంలో సగానికిపైగా ఆక్రమించుకున్న ఈ కథ చదివినంతసేపూ పాఠకుడు మాలపేటలో ఉండి ఆ జీవితంలో మునిగితేలతాడు.

మధ్యతరగతి కథకుడు మధ్యతరగతి జీవితం గురించికూడా ఇంత "వివిడ్"గా రాయటం చాలా అపూర్వమైనవిషయం.

All art is contajious అని ఏ సలభైవీళ్ళక్రితమో విని ఔననుకున్నాను. కాని పట్టుకుని వదలని రచనలుగా అనుభవంలో చాలాకొద్ది. ఆ కొద్దిలో కాళీపట్నం రామారావు కథలున్నాయి,

"చావు"లో కథ టూకీగా ఏమిటంటే:

పేటలో ఒక ముసలిది చచ్చింది. శీతాకాలం, పేటవాళ్ల నాలుగుడబ్బులు సంపాదించుకునేరోజులు. రాత్రికిరాత్రి శవాన్ని దహనమో, ఖననమో చేసి, మళ్లా తెల్లారు జామునే పేటంతా పనుల్లోకి పోవాలి. ముసలిదాన్ని పాతెయ్యటం గడియపని. కాని అందుకు అభ్యంతరాలున్నాయి. శవాన్ని పాతేస్తే ప్రాణి దానిచుట్టూ తిరుగుతుందని కొందరి మూఢవిశ్వాసం. దహనంచెయ్యాలంటే కట్టెలు కావాలి. అవిదొరకవు. అర్థరాత్రపూట ఎవరినిలేపి కట్టెలు ముట్టెత్తుతారు? ఎత్తినా ఎవరు "అయ్యో, పాపం!"అనియిస్తారు, కట్టెలఎత్తుకురావచ్చు. అందుకు పాపభీతీ, మనిషిభీతీకూడా అడ్డంవస్తాయి,

తీగెకదిలిస్తే డొంకంతా కదిలిందన్నట్టు, ముసలిదాని శవంమీదుగా అట్టడుగువాళ్ల మొత్తం జీవితమూ, వాళ్ళమధ్య సహకారభావమూ, విభేదాలూ, వారి మూఢవిశ్వాసాలూ, వాస్తవసమస్యలూ సూక్ష్మాతిసూక్ష్మంగా, హృదయాలలో గుచ్చుకునేలాగు ఈ కథలో చర్చించబడ్డాయి.

దారిద్ర్యమూ, బాధ, సాంఘికదోపిడీ, అజ్ఞానమూ చిత్రిస్తే జుగుప్సాకరంగా ఉంటుంది గనక అట్టడుగుజీవితం గురించి రాయరాదనే సిద్ధాంతం ఒకటి ప్రచారంలో ఉన్నది. ఆ సిద్ధాంతానికి ఈ కథ చెంపపెట్టు. ఇది సౌందర్యంతో తొణికిసలాడేకథఅని బాధ్యతాయుతంగా చెప్పగలను. ఈ సౌందర్యానికి వెనక కవితేలేని వాస్తవికతా, స్వభావచిత్రిణా, పురోగమనానికి అవసరమైన భావచైతన్యమూ తీర్చిదిద్దినట్టున్నాయి. అసమర్థుడైన రచయిత చేతిలోపడితే ఈ పాత్రిలూ, వారి మనస్తత్వాలూ ఎలా ఛిద్రించి ఉండేవో తలుచుకుంటే భయంవేస్తుంది.

అభ్యుదయకాముకులందరూ మాలపేటల్లోకి వెళ్ళి వారి జీవితంలో పాల్గొనలేకపోవచ్చు. వాళ్లు యీ కథ మళ్ళీ మళ్ళీ చదివి అంత అనుభవమూ పొందవచ్చు. ఇంతకన్న ఈ అమోఘరచనగురించి వివరించటం నాకిష్టంలేదు.

—కొడవటిగంటి కుటుంబరావు.

## 'ఎరుపు' పోరాటరూపం

'ఎరుపు' పాటలు: సుబ్బారావుపాణిగ్రాహి.
ప్రచురణ: విప్లవ రచయితల సంఘం, హైదరాబాద్.

విప్లవపోరాటం లేకుండా విప్లవసాహిత్యంరాదు. శ్రీకాకుళ గిరిజన పోరాటం—అందులో ఆలోచనలు, అసువులు అర్పించిన ఎందరో అజ్ఞాతవీరులు పుట్టారు గనుక సుబ్బారావు పాణిగ్రాహి పుట్టాడు. ఎర్రజెండా సిద్ధాంతంతో తమ హృదయాలకు వీరగంధం పూసుకొని తమ బలిదానాలతో గిరిజనోద్యమ చరిత్రపై రక్తకేతనం ఎగరేసిన సత్యం, కృష్ణమూర్తి, భాస్కరరావు, నిర్మల, పాణిగ్రాహి- ఒక టీచర్, ఒక యువమేధావి, ఒక డాక్టర్, ఒక వీరనారి, ఒక కవి. కాని విప్లవాన్ని ఒక సమగ్రమైన ఉద్యమంగా చూడగలిగినవారికి వీరంతా చారిత్రిక భౌతికసంధ్యలలో ఉదయించిన గెరిల్లాలు. గెరిల్లా కట్టెలుకొట్టేవాడు, గెరిల్లా కవిత్వంరాసేవాడు, గెరిల్లా గాయాలకుకట్లు

కట్టేవాడు, గెరిల్లా ఆలోచనలకు రూపుకట్టేవాడు. గెరిల్లా మార్క్సిజం- లెనినిజం మావో ఆలోచనావిధానం పాఠాలు చెప్పేవాడు. గెరిల్లా పీడితులనుంచి, తాడితులనుంచి ప్రజలనుంచి పాఠాలు నేర్చుకునేవాడు. గెరిల్లా నడుస్తూ నడిపించేవాడు. శత్రువు గుండెపై పోరాడుతూ సాయుధపోరాటం ఆచరణ వినాదాన్ని అనువదించేవాడు. గెరిల్లా ఒక సమగ్రమైన మనిషి. పరిపూర్ణమైన వ్యక్తిత్వం వికసించినవాడు

లెనిన్ సాహిత్యం గురించి కళలగురించి మాట్లాడినా, స్టాలిన్ భాష గురించి ఏ అత్యంత ఆధునిక భాషాశాస్త్రవేత్తలకయినా ఒరవడికాగలిగిన మాటలుచెప్పినా; మావో, హోచిమిన్‌లు స్వచ్ఛమైన కవిత్వం చెప్పినా— వాళ్లు సాహిత్యవేత్తలు కావటంవల్లనో, సాహిత్యవేత్తలుకావాలనో చెప్పినవికావు. ప్రజాహృదయవేత్తలు కావడంవల్ల ప్రజల్లో మసలి, ప్రజలనుంచి నేర్చుకొని ప్రజలకోసం చెప్పిన పాఠాలవి. అందుకే అవి శ్రామిక కళాఖండాలు.

ప్రపంచసాహిత్యంలో లెనిన్ సృష్టించినంత సాహిత్యం, ఆ సాహిత్యం ప్రపంచ భాషల్లోకి పొందినన్ని పరివర్తనలు ఏ బూర్జువాసాహిత్యంలోనూ రాలేదు. అయినా లెనిన్‌ను సాహిత్యవేత్త ఐనందువల్లకాదు శ్రమజీవుల ప్రపంచం తమ మహోపాధ్యాయుడిగా గుర్తించేది— ఆయన విప్లవ పరివ్రాజకుడైనందువల్లనే. ఆయన నిర్వహించిన పోరాటంలో ఆయన సాహిత్యంకూడ భాగమే. పోరాటంలోకాకుండా మావో, హోచిమిన్‌లు అంత వుత్తమ కవిత్వాన్నిగాని, భవిష్యత్ తరాలకు వెలుగుబాట కాగల మార్క్సిస్టు తాత్విక ఆలోచననుగాని సృష్టించగలవారుకాదు. ఇది చారిత్రక యదార్థవాదం.

జీవితంలోని అన్నిరంగాల్లోనూ అవసరమైనంత అర్హతలను అభ్యాసంద్వారా సాధించేవాడే నిజమైన కమ్యూనిస్టు. కమ్యూనిస్టయినవాడు తన ప్రతిభావ్యుత్పన్నతల పట్ల ఆత్మవిశ్వాసంతో వ్యవహరిస్తాడు. ఎందువల్లనంటే ప్రతిభ, వ్యుత్పత్తి అభ్యాసం అని చెప్పే మూడులక్షణాలనుకూడ అతడు ప్రజలనుంచే గ్రహిస్తాడు. అందుకే అతడు మాత్రమే ప్రజలభాషలో ప్రజలభావాల్ని చెప్పగలడు.

బూర్జువాసాహిత్యరంగంలో మహాకవులు, కుకవులు వుండొచ్చు. అసమసమాజంలో కవుల్లోకూడ అసమానతలు లేకపోతేనే అసహజం, ఆశ్చర్యం! విప్లవ సాహిత్యరంగంలో విప్లవకవులుమాత్రమే వుంటారు. విప్లవసాహిత్యరంగం విప్లవసమాజం నుంచి వేరుపడ్డది కానపుడు (కాజాలదు) విప్లవకవి విప్లవ పోరాటంలో ఒక సమిధ మాత్రమే ఐనపుడు కవే గెరిల్లా. గెరిల్లాయే కవి. అందుకే సుబ్బారావు పాణిగ్రాహి జముకులకథను, బుర్రకథను, గేయాన్ని, చివరకు జీవనవృత్తియైన పూజారితనాన్ని

కూడ తుపాకి మరింత ధ్యేయంతో, బలంతో ఎట్లా వర్గశత్రునిర్మూలనకు ఉపయోగించ వచ్చునో తెలుసుకోటానికే నేర్చుకున్నాడు, రాశాడు, పాడాడు, నేర్పాడు, గురిచూచి కాల్చాడు. ఆయనకు తుపాకితోపాటు కలాన్నందించింది పోరాటం. ఇవ్వాళ ఆయన కలాన్ని కవిత్వంగా ఆదరించలేనివాళ్లు ఆయన ఆయుధాన్ని విప్లవసాధనంగా గుర్తించ లేనివాళ్ళే. ఆయన గళం ప్రజల్లో విచ్చుకున్నట్టే, ఆయన కలం ప్రజల్లోంచి తెచ్చు కున్నది. అందుకే ఆయన ప్రజాకవి. ప్రజలంటే శ్రమజీవులు. (మనకు శ్రమజీవులతో సంబంధంలేని 'ప్రజాకవు'లున్నారు) పాణిగ్రాహిని ప్రజాకవిగా యెవరు గుర్తించారు? ప్రజలు గుర్తించారు. ఎందుకు గుర్తించారు? ఆయన ప్రజల్లో కలిసిపోయాడుగనుక. కలిసిపోయి ప్రజలతోపాటు పోరాడాడుగనుక, పోరాడుతూ గళంవిప్పి పాడాడుగనుక. తుపాకితో పంబమీటాడు గనుక. ఆయన కవిత్వం బూర్జువాపరిభాషలో చెప్పుకునేట్లు కాగితంమీద రాసిన కవిత్వంకాదు. అది శ్రీకాకుళ గిరిజనోద్యమచరిత్రలో భాగం.

విప్లవరచయితలసంఘంకూడ ఈ చారిత్రకసత్యాన్ని విస్మరించి అప్పటికే రెండు సంపుటాలుగా వచ్చిన పాణిగ్రాహి పాటలతోపాటు ఇంకా అముద్రితంగావున్న వికూడ కలిపి ఒక నిండయినపుస్తకంగా తెచ్చేబదులు 'ఎన్నిక'చేసిన పాటలే 'ఎరుపు'గా వేయ డం ఆ పాటలతో పరిచయమున్న ప్రజలు సహించలేరు,

పాణిగ్రాహి కవిత్వంరాయలేదు— మంచిచెడ్డలు ఎన్నడానికి. ఆయన పాడాడు. ఆయన పాడిందల్లా ప్రజలకు పట్టింది. అది శ్రావ్యంగా ఉండటంవల్లికాదు. అవి తమ లోంచి తమకోసం వచ్చినయిగనుక.

తెలంగాణ పోరాటం పాటలుగాని, చరిత్రగాని కాగితంమీదలేకుండాపోయాయి. భావి యువతరానికి శ్రీకాకుళ గిరిజనపోరాట చరిత్రయినా స్పష్టమైన వెలుగులో అవ గాహన కావడానికి పాణిగ్రాహిపాటలు దొరికినవన్నీ రెండోముద్రణలోనయినా చేర్చి విరసం తన చారిత్రకబాధ్యతను నిర్వహిస్తుందని ఆశిస్తాను. అంతేగాదు ఖమ్మంసభల్లో ప్రకటించిన తెలంగాణనుంచి శ్రీకాకుళందాక వచ్చిన పోరాటం పాటలుకూడ సేకరించి ప్రచురించాల్సినబాధ్యతకూడ విరసం విస్మరించకూడదు.

చివరికొక ముఖ్యమైనసూచన, విరసం ముఖ్యంగా పాటలే ప్రచురించాలి. అవి కూడ పోరాటప్రాంతాల్లో పాడుకునేవో, శ్రామికులు పాడుకునేవో అయితేనే మంచిది. అంతేకాదు ప్రచురించే ప్రతిపాటనూ పల్లెపల్లెనపాడి ప్రచారంచేసే సాంస్కృతికసంస్థగా పరివర్తనచెందితే తప్ప విరసం ప్రజల్లోకిపోదు. ప్రజల్లోకి పోకుండా ఏం నేర్పుతాం? ఏం నేర్చుకుంటాం? విరసం విప్లవ రచయితల సంఘం కావటానికన్న ముందు ప్రజా రచయితల సంఘంగా తన్ను తాను దిద్దుకోవాలి.

## 'కొక్కొరోకో' వేళకేకూసింది

బ్రతుకు పాటలు– ఎం. సుధాకర్, వడ్డెపల్లి, వరంగల్.

విప్లవ రచయితల సంఘం ఏర్పడ్డతర్వాత ప్రచురించబడిన పుస్తకాలన్నిట్లోకి 'ఎరుపు'తర్వాత పేర్కొనదగ్గ పుస్తకం 'కొక్కొరోకో' మాత్రమే. నిషేధించబడ్డందుకుకాక 'నరుడో! భాస్కరుడా,'కోసం యింత సార్థకమయింది. అలాంటి పాటలు కనీసం వేళ్ళమీద లెక్కపెట్టదగినన్నయినా'కొక్కొరోకో'లోవున్నాయి. 'కొక్కొరోకో' ఎప్పుడు వచ్చి ఎప్పుడు కాపీలు అయిపోయాయో, ఎన్నికాపీలు వేశారోగాని ఏ విప్లవ సాహిత్యసభలోవిన్నా 'కొక్కొరోకో'పాటలే. ఏ మీటింగ్‌లో చూసినా ఈ పాటలున్న పుస్తకాలు ఎక్కడదొరుకుతాయన్నప్రశ్నలే. పుస్తకాలు అయిపోయాయని సమాధానం. ఈ పాటలు ప్రచారంలోకి వచ్చేనాటికే పుస్తకాలు అయిపోయినట్లున్నాయి. అందుకే ఒకవిధంగా ఈ సమీక్ష పుస్తకసమీక్షకాదు. పుస్తక ప్రచార సమీక్ష. నిజానికి పాటలను పుస్తకాల్లోచదివికాకుండా, సభల్లోవిని సమీక్షించటమే న్యాయం. సభల్లో విన్నప్పుడు కూడ గాయకుని మొహంవంకకాక ప్రజల మొహాలవైపుచూస్తే పాటసత్తా యేమిటో తెలుస్తుంది. ఈవిధంగా ప్రత్యక్షంగా అరదజనుసభల్లో ఈ పాటల్లోవున్న బలమేమిటో చూశాను. ఈ పాటలను నేను విన్నంతవరకు చక్కగా ప్రచారంచేసిన ఇద్దరుగాయకులు ఎన్. కె. చెరబండరాజు. ఎక్కువగా ప్రచారం పొందిన పాటలు 'మాలోని మనిషివే....' (పోలీసుపాట) "కలలుమోసే అయ్య కదిలిరావాల...." లేదంటావా– ఇది కాదంటావా? మరి ఏమంటావో– పెత్తనమా దొరతనమా? (ఏయెసెల్లె), 'లాల్‌సలామ్'– వీటిలో లాల్‌సలామ్ అలంకారాలతో సంస్కృత సమాసాలతోఉన్నా నాగభూషణ పట్నాయక్‌మీద రాసిందిగనుక సభల్లో ప్రజలు కోరుతున్నారు. తక్కిన మూడు చాల మంచి పాటలు. పోలీసుపాట నిజంగా పోలీసువాళ్లతో తలలూపిస్తున్నది. 'ఏయె ఏయెసెల్లెవలయేయెసెల్లె'లో విషాదమూ, కర్తవ్యమూ, కోమలమైన కవితాస్పర్శ వున్నాయి. పల్లెజనంలో ఏవోస్మృతులను రేపుతుంది, 'లేవంటావా– ఇది కాదంటావా' పట్టణప్రజల్లో, ముఖ్యంగా కార్మికుల్లో, రైతుల్లోనూ ఆంధ్రప్రాంతంవంటి యింగ్లీషుమాటల పరిచయమున్న చైతన్యవంతుల్లోనూ విపరీతంగా ప్రచారాన్ని పొందుతుంది. ఈ అన్నిటికంటె చాల గొప్పది అయికూడ ఈగాయకులు శ్రద్ధతీసుకోకపోవడంవల్ల ప్రచారంలోకిరాకుండా మరుగునపడిన ఉత్తమోత్తమ కళాఖండం 'నాచెల్లీ! చెంద్రమ్మా!'. ఇందులో కథ వుంది. విషాదం వుంది. వీరం వుంది.

సందేశం వుంది. ఆయారసాలను సున్నితంగా పోషించిన కవిత్వం వుంది. పాడగల చేవవున్నవాడుంటే గుండెచెరువయిపోతుంది. ఒకకంట్లో కన్నీరు. మరోకంట్లో కణ కణమండే క్రోధాగ్ని ఒకేసారి పెల్లుబుకుతాయి. పాట అయిపోయేవరకు మన అందరి ముఖాలమీద చెల్లీ చెంద్రిమ్మ రక్తంతోతీర్చిన ప్రతిజ్ఞ, శత్రువుగుండెల్లోకుచ్చిన కత్తిలా మెరుస్తూవుంటుంది. ఈ పాటను ప్రచారంచేయడంలో విరసం గాయకులుచేసిన అశ్రద్ధ క్షమించరానిది. 'కాక్కొరోకో' ఉత్తేజాన్నికలిగించే మరో మంచిపాట. మామూలుగా చెప్పినట్లు చెప్పి ఒక్కసారి కవితాశిఖరాలమీదికెగిరి గుండెలనుపిండే లక్షణం ఈ చిన్న పాటలోనూ కనిపిస్తుంది. 'ఏతమెత్తినవాడ। ఏరుకట్టినవాడ ... కంతమోసినవాడ'

'జెగంటలు' 'తూర్పుపవనం వీచెనోయ్।' విరసం గాయకులు ప్రతిసభలోనూ సామూహికంగా పాడవలసిన ప్రబోధగీతాలు. విరసం తాను ప్రచారం చేయవలసిన సాహిత్యమేదో తాను గుర్తించకపోవడం విస్మయకరమే కాదు, విచారకరంకూడ. ఉయ్యాలపాట, బుర్రకథ- చాలప్రయోజనాత్మకమైనవి. బుర్రకథ తిరుపతిలో చెప్పబడి బాగా ప్రచారం పొందిందటకూడ.

ఎం. సుధాకర్ యీ విప్లవపాటల సంకలనాన్ని కూర్పుచేయటమే కాకుండా స్వయంగామంచిపాట(వెలిగిందిదీపం)రాశాడు. తెలంగాణలో విశేషంగాప్రచారంలోఉన్న

"గోరెనక గోరికట్టి
చుట్టూత గోరికట్టి
ఏ గోరిలా పెడుదునో కొడుకో
నైజాము సర్కారోడ" అన్నబాణిలో
తండెనక తండ వుంది
గుండెల్లో మంట వుంది
ఏగుండె నార్పుతావు
దబ్బున్నభడవకొడకా?"

అని గుండెల్లో మంటతో ప్రశ్నిస్తున్నాడు. ఇలాంటి పాటలపుస్తకాలు ఇంకా తేవటమే కాకుండా, ఇవి చక్కగా ప్రచారం పొందటానికికూడ తగిన శ్రద్ధ తీసుకోవాలని కోరుతున్నాను. 'కాక్కొరోకో' ఒక్క పుస్తకంలేకుండా పోయినా ప్రజాహృదయాల్లో వైతాళికగీతాలు పాడుతూనే వుంటుంది.

కాక్కొరోకో అని కోడికూసింది
నిదురబోయేసీమ కదలబారింది
కక్కుకొట్టాలిరా కొడవళ్లకు
ఇంక పదునుపెట్టాలిరా! కొడవళ్ళకు.

— బాలవీరయ్య.

సాహిత్యలేఖలు:

## మార్క్సిజానికి బూజుపట్టిందా?

జూన్ 'సృజన'లోని "కాకతీయుల గుళ్లు కూలిపోతున్నాయ్" అనే వ్యాసంలోని భావాలు, పదజాలం చాలా, చాలా విప్లవాత్మకంగా ఉన్నాయి.

ఈ వ్యాసం చదివాకగానీ కారల్ మార్క్స్ అనే ఓ అమాయకుడు కళల్ని గురించి వెలిబుచ్చిన భావాలు ఎనభై ఎనిమిదేళ్ళనాటి "చెత్త"అనే మహత్తర సత్యం నాకు స్ఫురించనందుకు చింతిస్తున్నాను

అలాగే లెనిన్ అనే మరో అమాయకుడు ప్రాచీనకళాసంపదగురించి చెప్పిన మాటలూ, ఆచరణలో స్వయంగాతీసుకున్న చర్యలుకూడా ఏభయ్యేళ్ళనాటి బూజుపట్టిన బూర్జువాభావాలేనన్న వాస్తవం గ్రహించి ధన్యుడనయినాను.

రష్యా, జెకోస్లవేకియా, పోలండ్, రుమేనియాల్లాంటి కమ్యూనిస్టుదేశాలు తమ తమ ప్రాచీన కళాసంపదలను ధ్వంసంచేయకపోగా వాటికి ప్రత్యేక రక్షణలు కల్పించి కాపాడినందువలననే అవి రివిజనిస్టు దేశాలుగా మారిపోయాయనే చారిత్రిక సత్యంకూడా నాకు సులువుగా బోధపడిపోయింది.

అయితే నాకు మింగుడుపడని వాస్తవం ఒకటి మిగిలిపోయింది.

ఆధునికయుగంలో మార్క్సిజానికి మహోత్తమ భాష్యకారుడుగా సుప్రసిద్ధుడైన మావో ప్రాచీనకళలు, సంస్కృతి ఆదిగాగల విషయాలను గురించి తన ప్రఖ్యాతమైన "ఏనాన్ టాక్"లో అత్యంత విప్లవకర భావాలను ఏనాడో వెలిబుచ్చి ఉన్నాడు.

అట్టి మావో అధ్వర్యానగల కమ్యూనిస్టుపార్టీ పాలనలోకి చైనావచ్చి రెండుదశాబ్దాలకుపైగా గడిచిపోయింది. ఆ దేశానికీ, ప్రజల మనసులకూ పట్టిఉన్న ఫ్యూడల్ అవశేషభావాల బూజుని ఝళనం చేసేందుకుగాను ప్రచండంగా వీచిన సాంస్కృతిక విప్లవ ప్రభంజనంకూడా తన కర్తవ్యాన్ని నెరవేర్చుకుంది.

అయినా చైనాలో గతకాలపు సంస్కృతీచిహ్నాలుగా మిగిలిఉన్న అసంఖ్యాకమైన ప్రాచీనకళా నిర్మాణాల్నిగానీ, సంపదనుగానీ ధ్వంసంచేసినట్లు నా దృష్టిలోకి రాలేదు. పైగా అలాంటివాటిని తమ పూర్వుల కళాకుశలతకు, తమకు లభించిన కళావారసత్వానికి అమోఘమైన నిదర్శనలుగా సగర్వంగా చూపుకుంటూనేఉన్నారు. ప్రత్యేకగ్రంథా

లుగా, రంగురంగుల ఆల్బంలుగా, కలర్ పోస్టు కార్డులుగా, ఫోల్డర్లుగా వాటిని ముద్రించి విస్తృత ప్రచారం యివ్వటంలాంటి 'బూర్జువా' పనులు అక్కడ ఎందుకు, ఎలా సహింపబడుతున్నాయో నాకు అర్థంగావటంలేదు.

ప్రాచీన కళావశేషాలు, ఆరామాల సంగతలావుంచి కళాత్మకంగా రూపొందింప బడినవనే కారణాన పూర్వపు రాజవంశీకుల ఉపయోగార్థం తయారయినవాటినికూడా వారు భద్రపరచి తమ పూర్వకళాకారుల ప్రజ్ఞాపాటవాలకు నిదర్శనలుగా, వాటిని విదేశీయులకుసైతం ఘనంగా ఎందుకు ప్రదర్శించుకుంటున్నారనేదే నా అవగాహనకు అందటంలేదు.

దీని అర్థం ఏమిటి? మావోకూడా ఆచరణలో "బూర్జువాభావవాది"గా, "రివిజనిస్టు"గా మారిపోయాడా? లేక పరిణామక్రమంలో వాటికేమయినా చారిత్రిక ప్రాముఖ్యతవుండి అలా చేస్తున్నారా? ఇదొక్కటే నాకు మింగుడుపడకుండా ఉన్నది.

పూర్వకాలపు కళావశేషాలన్నింటినీ ధ్వంసం చేయమని 'సృజన'లోని వ్యాసం ప్రబోధిస్తున్నది. శుభం! ఆ లెక్కనచూస్తే కాకతీయులనాటి కళానిర్మాణాలను పనిగట్టుకు మరీ ధ్వంసంచేసిన ముస్లిం పాలకులూ, జగ్గయ్యపేట, ఆ పరిసరాల్లో అసంఖ్యాకంగా దొరికిన, వేలాదిమంది శ్రామికుల సంవత్సరాల శ్రమఫలితమైన బౌద్ధశిల్పాలుగల పాలరాళ్ళను కాల్పించి, ఆ సున్నంతో దివ్యహర్మ్యం నిర్మింపజేసుకున్న ముక్త్యాల రాజావారూ గొప్ప సృజనాత్మక మార్క్సిస్టు మేధావులూ, విప్లవవీరులూ అయివుండాలి.

పాపం శమించుగాక!

మానవుడిని మానవుడుగా తీర్చిదిద్దిన వేలాది సంవత్సరాల క్రమక్రమానుగతాభివృద్ధి క్రమంలో ఆయాదశలకు ప్రతిబింబాలయిన ప్రాచీన కళావశేషాలకుగాక కేవలం దేవుళ్ళకు మాత్రమే ప్రసిద్ధమైన ఆలయాలు ఈ పవిత్రభారతంనిండా అసంఖ్యాకంగా ఉన్నాయి. వీళ్ళందరికీ చీఫ్‌అయినవాడు మరెక్కడోగాక మన దొడ్లోనేవున్నాడు.

భక్త పరమాణువుల బుర్రల పైభాగాన్నేగాక లోపలిభాగాన్నికూడా శుభ్రంగా తిరిగి భోంచేసే ఈ దేవుళ్లమీదా, వారి ఆశ్రియాలమీదా తక్షణ కర్తవ్యంగా, ఉధృత రూపంలో, సర్వతోముఖంగా సాగించవలసివున్న దాడిని, కేవలం మానవరూపసౌందర్యానికి ప్రతిభావంతమైన చిత్రీకరణలుగా, ఒకనాటి చారిత్రిక విభాతసంధ్యల్లో విలసించిన కళాకుశలుర నైపుణ్యానికీ, శ్రమకూ సంకేతాలుగా నిలచివున్న కళాసంపదపైకి మళ్లించజూడటం ముందున్న బాధ్యతలను పక్క కునెట్టజూచే బాధ్యతారహిత పెడధోరణి అవుతుందేమోకూడా ఓసారి నిదానంగా ఆలోచించుకోవటం మంచిది.

— చలసాని ప్రసాదరావు.

"కార్మికవర్గ సంస్కృతి అనేది ఆకాశంనుండి ఊడిపడిందేమీకాదు. కార్మికవర్గ సంస్కృతిలో ప్రవీణులమని చెప్పుకునేవారి సృష్టి అంతకన్నా కాదు. అలా అనటం అర్థంలేని వాగుడుమాత్రమే.

"పెట్టుబడిదారీ, భూస్వామ్య అధికారదర్ప సమాజాల నొగలక్రింద నలుగుతూ మానవజాతి సంచయించిన విజ్ఞాన భాండారంనుండి సహేతుకంగా పెంపొందినదే కార్మిక వర్గ సంస్కృతి.

"మానవజాతిసృజించిన మహాసంపద అంతటితోనూ నీమనస్సును సుసంపన్నం చేసుకున్నపుడు మాత్రమే నీవు కమ్యూనిస్టువు కాగలవు."

— లెనిన్.

## నిహిలిజమ్

మిత్రాగారి 'కాకతీయులగుళ్లు కూలుతున్నాయ్' వ్యాసం సమంజసంగా లేదు. భావాలు అస్తవ్యస్తంగా ఉండడం అటుంచి నాకు నిహిలిజమ్ కనపడుతుంది. సాంప్రదాయ సంస్కృతి అంతా బూర్జువా అనరాదని ప్రజలుకూడ అందులో భాగస్వాములని స్టాలిన్ చివరిరచన 'ప్రాబ్లమ్స్ ఆఫ్ లింగ్విస్టిక్స్' (Problems of Linguistics) లో సూచించినట్లు జ్ఞాపకం. ఒక రాజకీయాలు తప్పితే మిగతావి అనవసరం అనడం మార్క్సిజంకాదు.

— డాక్టర్ ఎస్. వి. ఎస్. రావు.

## మన చరిత్ర?

సంపాదకులకు,

నాకీరోజు ఒక విచిత్రమైన పుస్తకం అందింది. దానిపేరు "మన చరిత్ర." రచయిత 'యేటుకూరి బలరామమూర్తి'

నేను కొన్ని 'భారత దేశచరిత్ర'లు మామూలుగ చదవటంమాత్రమే కాదు. లోతుగ పరిశీలించాను ఆర్. జి. భండార్కర్, డా. ఘోషాల్, డా. మహాజన్, డా. మజుందార్, డా. అల్టేకర్, డా. జైశ్వాల్, డా. రాధాకుముదముఖర్జీ, పి. టి. శ్రీనివాస అయ్యంగార్, సమద్దార్, డా. పాఠక్, నీలకంఠశాస్త్రి, రోమిలా థాపర్

మొదలగు జాతీయచరిత్రకారుల గ్రంథాలేగాక, ఆక్స్‌ఫర్డ్‌వాళ్లు రచించిన భారతదేశ చరిత్రలుకూడ చదివాను. భవాన్స్‌వాళ్ల ప్రచురణ 10 సంపుటాల్లో మొదటి నాలుగు కూడ చదివాను, నా చిన్నతనంనుండి చదివాను.

కాని ఈ 'మనచరిత్ర' లాంటి విచిత్రమైన చరిత్ర ప్రప్రథమంగ చూశాను; ఇంతలోతుగ చదవలేదనుకోండి. ఈ రచయిత కొన్ని నిర్ణయాలు గమనించండి.

1) అశోకుడు పేదప్రజలరాజు, ధనికుల దోపిడీనుండి, బ్రాహ్మణనిరంకుశత్వం నుండి ప్రజలను రక్షించే చట్టాలు చేశాడు.

2) అక్బర్ మతాలకు వ్యతిరేకంగ ప్రచారంచేశాడు. (ఇస్లాంకువ్యతిరేకంగా)

3) భారతదేశంలో మొగల్‌పాలన ఒక స్వర్ణయుగం. (పేజి 202)

4) వ్యక్తి ఔదార్యం, సామాజిక పరిస్థితులకు తోడ్పడి, సమాజ పరిణామానికి దోహదం చేసింది. (పే. 85)

5) చంద్రగుప్తుడు సైనికబలంద్వారానేగాక, శాంతియుత పద్ధతులద్వారాకూడ రాజ్యవిస్తరణ సాగించాడు. (పే. 81)

6) అశోకుడు మహాపురుషుల్లో నిస్సందేహంగా అగ్రశ్రేణికిచెందినవాడు. (పే. 89)

7) ఎస్ ఎ. డాంగే సలహాపై గాంధీజీ 1930,34,42 ఉద్యమాలను వేటినీఅహింస అనే ప్రాతిపదికపై ఆపివేయలేదు. (పే. 275)

8) నెహ్రూ, మార్క్సిజంలోని చారిత్రక భౌతికవాదదృష్టిని స్వీకరించాడు. (పే 279)

9) టాల్‌స్టాయ్ భావాలతో ఉత్తేజితుడైన గాంధీ భారతదేశంలో విప్లవాత్మకపాత్ర నిర్వర్తించగలడని లెనిన్‌భావన. (పే. 281)

10) స్టాలిన్ నాయకత్వంలోని సెక్టేరియన్ దృక్పథంవల్లకూడ భారత కమ్యూనిస్టు ఉద్యమం తప్పుడుదారిన నడిచింది. (పే. 282)

ఇవి మచ్చుకు కొన్ని మాత్రమే. నా భావన ఏమంటే-

1) ఈ పుస్తకం ప్రారంభంలో 'చరిత్రఅంటే కదిలించేది' అని యిచ్చిన నిర్వచనం తప్పు. చరిత్ర అంటే ప్రజల వుత్పత్తి, సంపదాలకు, వర్గపోరాటాలకు సంబంధించింది, వ్యక్తులుకాదు.

2) చరిత్ర బాహ్య భౌతిక పరిస్థితులకు సంబంధించింది. కాని యీ రచయిత, చరిత్రకు సంబంధించిన ఆత్మజ్ఞానం కొరకు కృషిచేస్తున్నట్లు పీఠికలో చెప్పు కున్నాడు.

3) 'రాచరికం' అనే ఒక సామాజికవ్యవస్థచే ఎన్నుకోబడ్డవారే రాజులు, చక్ర వర్తులు. అందుచేత మంచిరాజులు, చెడ్డరాజులు అని రెండురకాలు ఉంటానికి వీల్లేదు. కామ్రేడ్ అశోకమహారాజు కామ్రేడ్ అక్బర్ చక్రవర్తులుండరు.

4) భారతదేశంలో స్వర్ణయుగమంటూ ఏనాడూలేదని మార్క్స్ ఇండియానుగురించి చెప్పిన తదుపరికూడ ముస్లిం పరిపాలన భారతదేశంలో స్వర్ణయుగం అని వ్రాశాడీరచయిత.

5) వ్యక్తిప్రాధాన్యం, ఉదారవాదం, తాత్వికచింతన, ఉగ్రవాదం మధ్యేమార్గాలకు చరిత్రలో ప్రాధాన్యతలేదు. వర్గపోరాటాలను ప్రక్కదారులు పట్టించటానికే ఇలా వ్రాస్తారు.

6) దోపిడీవర్గాలనే ప్రజలుగాను, ఒక్క డాంగే, ఒక్క గాంధీజీలు మాత్రమే భారతప్రజల నాయకులుగాను చిత్రించటం సెక్టేరియన్ దృక్పథం ఔతుంది.

ఇంత తప్పులుతడక పుస్తకాన్ని యెందుకు ప్రచురించారు? కేవలం పుస్తకాల వ్యాపారం దృష్టితోతప్ప, లాభాలే ప్రధానధ్యేయంతప్ప మరే కారణం కన్పించదు. ఇలాంటి సాహిత్యంద్వారా ప్రజానీకానికి విషం పంచిపెడుతున్న విశాలాంధ్రవారిని గురించి మీరు ఆలోచించాలని కోరుతున్నాను.

ఈ విషగాలుల్నుండి ప్రజల్ని రక్షించటం సాహితీ మిత్రుల బాధ్యతకాదూ?

— డా. యస్. వి. రావు.

పత్రిక-ప్రయోజనం

సృజన వచన కవితల్లోను, ఇతరగేయాల్లోను ఇంకా ఎక్కువ శ్రద్ధతీసుకుంటే బాగుంటుంది. స్థాయి రోజురోజుకు పడిపోతున్నట్లు కనిపిస్తుంది. పామరులకు అందు

బాటులోవుండే భాష అవసరం. ఏదో పెటీబూర్జువా మేధావులు ఒకదఫా చదివి అవతల పారవేస్తే దానివల్ల ఆశించిన ఫలితం శూన్యం. పత్రిక ఇంకా పల్లెసీమలకు చేరలేదు. అందుకు ప్రయత్నాలుచేస్తే బాగుంటుంది. వచనగేయాలు భాగం తగ్గించి వివిధ వ్యాసాలకు ఎక్కువచోటు కల్పిస్తే బాగుంటుంది. గ్రామజీవితాలపై కుప్ప తెప్పలుగా రచనలు సాగించాలి. అప్పుడే పత్రిక స్వశక్తిపై ఆధారపడుతుంది.

ఒక పాఠకుడు
విశాఖపట్నం.

**SRJANA Telugu Monthly** **July '72** **Regd. No. H-1088**
Regd No. with Registrar of News Papers 10953/67




# విప్లవ రచయితల సంఘం

రెండవ మహాసభల

## ప్రత్యేక సంచిక

వెలువడింది.

ప్రతులకు: 1) ప్రధానకార్యదర్శి, విరసం, 2-2-982 అంబర్ పేట, హైదరాబాద్-13.
2) సృజన, హనుమకొండ, వరంగల్-1.

---

## ముట్టడి

'ప్రతిగేయం నెత్తుటిదీపం'

అంటున్న

రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి పీఠికతో

## చెరబండరాజు

కొత్త కవితా సంపుటి

వెలువడింది. వెల: 2 రూపాయలు

ప్రతులకు: చెరబండరాజు, 2-2-982, అంబర్ పేట, హైదరాబాదు-13.

---

**84 Pages** **Re. 1/-**